# ఉష.

## (సాంఘిక కావ్యము.)

కవి:

దేవుపల్లి సత్యారావు.

కసిమికోట.

విశాఖ మండలము.

మొదటి కూర్పు 1,000 ప్రతులు.

శ్రీ పరమేశ్వరీ ముద్రణాలయమ్ము, అనకాపల్లి.

951.

 [వెల రు 2—0—0

# కృతి ప్రశంస.

క॥ ఉష యనెడి కావ్యరాజము
తుషితాత్ములఁ జేయు సంఘదోషము లుడుపన్
గృషిచేయు వారి నెల్లన్;
ఋషి వాక్కులు సత్యరాట్కవీ! సుధలుగదా.

కసిమికోట
26-5-51.

ఇట్లు,
పతి సూర్యనారాయణమూర్తి కవి.

# అభినందనము.

మానాభిమానముల్ మంటఁ గల్పెడు వేశ్య
వృత్తి నున్మూలింపుఁడీ యటంచు
సంఘంబులో దురాచారముల్ సమయఁగా
సత్యప్రచారంబు సల్పుఁ డంచుఁ
గులమునందున లోపముల దిద్దవలెఁగాని
కూలిపోనిచ్చుట కూడ దంచు
బాలబాలికలు విద్యాలాభమున్ బొంది
మనవలె సంఘ సేవనె యటంచు

ఆ॥ వె॥ పేద బాలికలను పెండ్లాడి ధనికులు
తఱుమవలయుఁ బేదతన మటంచు
సత్య శాంతి బోధ సలిపిన నీ యుష
సంతసము నొసంగె సత్యరాయ!

ఇట్లు,
భవన్మిత్రుఁడు
భాగవతుల నరసింహామూర్తి కవి.

విజయనగరము
11—6—51.

# పీఠిక.

శ్రీ దేవుపల్లి సత్యారాయ కవిగారు రచించిన "ఉష" యను కావ్యము అధునాత నాంధ్రకవితాలతయందుఁ బ్రభవించిన సుందర ప్రసూనములలో నొకటి. మృదుమధురమైన శైలిలో గంభీరమైన భావములతో నైతిక ప్రబోధమునకు నిలయమైన వీరి రచన సర్వజనాదరణీయ మగుటయేకాక, హిందూ సమాజ సంస్కారమునకు దివ్య సందేశ మగునని యాశించుచున్నాను. రసభరితమై మంద మందగమనముతోఁ దీయని కవితా తోయముతోఁ బ్రవహించు వీరి కవితా స్రవంతి ఇతోధికముగా ఆంధ్ర సారస్వతసీమను సస్యశ్యామలముగా నొనర్చునుగాత!

(Sd) ఎంపమూరి వేంకట రమణ,
M.A.B.E.D.
Lecturer in History.
P. R. College.

Cocanada.
5—3—49.

శ్రీ ర స్తు.

ఓం నమః కామేశ్వర్యై.

# మి త్రా భి నం ద న ము.

---

చ॥ "జలఉష" వీచిమాలిపయి - సాగుటకుఁ మును నేవి శాఖనం
డలమున నీ యుషాభ్యుదయ - నవ్యకళోదయమయ్యె సత్యనా
కృతులన మిటుండుఁగాదె రవి - గానని చోఁ గవి గాంచునన్న పె
ద్దల నుడికారమున్నది క - దయ్య జగత్తున సత్యరాట్కృతీ!

ఉ॥ నీకును నా కెదన్ బొదలు - స్నేహము సద్గుణసేవనాప్తసు
శ్రీ కవితా ప్రదీప్తి నల - రెన్ రసవత్తర కావ్యమూర్తులన్
లోకము సాదరంబగు వి - లోకనముల్ ప్రసరింపఁజేసి యు
త్సేకము నొందకుండఁగల - దే! పలుమాటలు సెప్ప నేటికిన్?

ఉ॥ అంచితసంప్రదాయకవి - తాంధ్రకవిత్వ కుటుంబమందు జ
న్మించి, గురూపదిష్టసర - ణిన్ శిరసావహియించి మించు స
భ్యాంచిత తావకీన కవి - తామృత వాహిని నే కవీశుఁ డా
నంచుఁ దలన్ ధరించి ముద - మందక యుండఁగలండు మిత్రమా!

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ.

సామర్లకోట.
25-10-50.

పుల్లకవి శేషగిరిరాయ కవి.

ఓం నమః కామేశ్వర్యై.

# కృతి సమర్పణము.

---

శ్రీతీర్థశిష్యు, మాయా
తీతుని, వర్ధాదివంశ - దీవ్యత్ఖని ను
ద్యోతించుమణిన్ మద్గురు
సీతారామాంజనేయు - సేవింతు నెదన్.

ప్రతిభాయుతుం డయి - బాల్యమందె "స్వరాజ్య
కవి" యను బిరుదంబుఁ - గాంచి మించె,
భరతమాతృక గీత - వ్రాసి దేశంబులో
బ్రహ్మణ్యుఁ డను పేరుఁ - బడసి వెలసె,
అష్టావధానంబు - లద్భుతంబుగఁ జేసి
జేజేల నొందుచుఁ - దేజరిల్లెఁ,
గాలానుగుణ్యమౌ - కావ్యముల్ రచియించి
విద్వత్కవు లొసంగు - వినుతు లందె

గీ॥ అల్ల సీతయు, రాముఁడు, - నాంజనేయుఁ
డను పదంబులు నామధేయమున - నమరు
నట్టి వడ్డాది కులరత్న - మైన గురుని
పాదసన్నిధి గృతి సమ - ర్పణ మొనర్తు.

మ॥ కవిగానన్నొనరించి, నాదుకవితా-కన్యన్ విలోకించుచున్
విపుల౯సంతసమొంది, యెల్లపుడు నా-మేలెంచి, దీవించు స
త్కృపవర్యుండగు నా గురుప్రభున కీ-కావ్యంబునర్పించి మ
ద్భవమున్ మత్కవితాకుమారిభవము౯-ధన్యమ్ముఁగావించితిన్

ఉ॥ ఆ రవితేజ మెట్టు లమృ-తాంశునిపైఁబడి వెల్గొసంగునో
యారయ నట్లెయెవ్వని మ-హాద్భుత భవ్యకవిత్వదీధితుల్
సోకెను నాపయి౯బడియు-షఃప్రభనీనెనో యాకవీంద్రు, భా
షాధగనాథు దివ్యపద - యుగ్మసమర్పణఁజేసి తీకృతి౯.

సీ॥ అహితులౌ వారల - యాత్మల ఛేదింపఁ
పాశుపతాస్త్రమై - పరఁగు నెద్ది
ఖల జనారణ్యంబు - ఖండించి హతమార్ప
నిశిత కుఠారమై - నెగడు నెద్ది

మిత్రమనోంబుజ - మిత్రోదయం బౌచు

సంతోషమును గూర్పఁ - జాలు నెద్ది

శిష్యలోకమునకుఁ - జింతామణి విధాన

నెల్ల శుభంబుల - నిచ్చు నెద్ది

గీ॥ యట్టి సద్గురుదేవు దీ - వ్యత్వ-విత్వ

మెల్ల వేళలయందు నా - హృదయసీమ

నాట్యమాడుచు, నవ్య యా - నంద మొసఁగి

నాదు జన్మమ్ము ధన్య మ్మొ-నర్చుఁగాత!

శ్రీ ర స్తు.

ఓం నమః కామేశ్వర్యై.

# ఆశీస్సు.

---

శ్రీమంతంబగు కవితా
సామగ్రి గడించుకొన్న - సత్కవి వగు ని
న్నామోదంబునఁ గని మా
కామేశ్వరి తల్లి బ్రోచుఁ - గాక కుమారా!

మ॥ కృతి నీ విచ్చితి, వందుకొంటి మనకున్ - గీర్తి ప్రతిష్ఠల్ జగ
త్త్రితయంబందున వెన్నెల ట్లలమి సం-దీపించుఁగాదే! భవ
త్ప్రతిమానుండగువత్స నేకదగురుల్ - వాంఛింతురీభక్తికిన్
బ్రతిగా నేమియొసంగుదున్? గొనుమి వే-వత్సా! శుభాశీస్సులన్

గీ॥ ఋషు లుషః ప్రభ నొంది త - రించి జగము
లన్నియుఁ దరింపఁ జేసిన - యట్లు నీవు
పరఁగ "నుష" పేరి కావ్యమ్ము - వ్రాసి యలరి
యలరఁ జేయుచున్నాఁడ - వాంధ్ర జగతి!

---

శా॥ స్వాతంత్ర్యమ్ముగడించుకొంటిమిఁకఁ దత్-సంపత్తి సర్వప్రజా
వ్రాతక్షేమకరంబుగా స్థిరముగా - వర్ధిల్లు సంస్కారమే
ఖ్యాతంబౌ పరమార్థమై విహితమై - కన్పట్టు నిప్పట్టునం
దాతాత్పర్యము వెల్లడించినభవ - ద్వ్యాహారముల్ శ్లాఘ్యముల్.

గీ॥ జగములోఁ గళావంతుల - సంఘమునకుఁ
దగిన సంస్కారసరణి బో - ధన మొనర్చి
వార్తమానపత్రంబులఁ బేర్మిఁ - బడసినావు
దేవుపలి సత్యరాయ! సు - ధీవిధేయ!

ఉ॥ తొల్లిటి సత్కవీశ్వరుల - తోఁ దులఁదూగెడు నట్టిశక్తిరా
జిల్లినవాఁడ నంచును వ-చించుట కాదు కృతీశ్వరత్వమున్
వెల్లువవాఱు భక్తిరస - వృష్టిమెయిన్ నినువంటి శిష్యు లు
త్ఫుల్లమనంబుతో నొసఁగఁ-బొందక నాకెటులుండఁగానగున్?

కం॥ మున్నభినవదండియు, దు
గ్గన్నయు గురువులకుఁ గృతుల- నంకితమిడి య
భ్యున్నతి నొందిరి, నిన్నుఁ బ్ర
సన్నతఁ గని రేమొ! వారు! - సత్యారాయా!

సీ॥ హిందియును నాంగ్లమును నాఙ్ఞ - కెదురుసూడ
నాంధ్రభారతి రత్నసిం - హాసనమున
నధివసించిన వేళ నే - యధికభక్తి
"నుష" నజరునెట్టి నాఁడ వో - హాహహా సుకవి!

గీ॥ ఫుల్లకవి శేషగిరిరావు - మోద మచ్చు
పడ, "గణేశకథాకల్ప - వల్లి" నాకు
సంకితం బిడినప్పు డే - టుందుకొంటి
నల్లె నీ "యుష"ఁ గౌగిలి - న్నందుకొంటి.

చ॥ మన కవితాకుటుంబము స - మస్తజనాదరణైకపాత్రమై
యనయముఁ దీర్ఘదేవుని ద - యామృతవార్ధితరంగపాళిపై
నొనరఁగఁ దేలియాడుచుమ-హోన్నతమైనయుషశ్శుభోదయం
బనువుగనొందుఁగాక పర-మాత్మనితత్త్వకళాప్రపూర్ణతన్.

వడ్డాది సీతారామాంజనేయ కవి.

శ్రీరస్తు.

ఓం నమః కామేశ్వర్యై.

# ఉష.

---

శా॥ శ్రీవాణీనగజాతలన్ గొలుతు నాచిత్తంబునం దెప్పుడున్
శ్రీవాగ్వైభవసంపదున్నతులుకూర్మిన్ మాకుఁ జేకూర్చుచున్
శ్రీవిశ్వంభరు, శ్రీసరోరుహభవున్ - శ్రీమన్మహాదేవునిన్
మావంకన్ శుభదృష్టివృష్టిఁ బ్రసరింపన్ జేసిమమ్మోముఁగన్

ఉ॥ భావమునందు నెల్లపుడుఁ బాయని వేడ్కభజింతుఁ బార్వతీ
దేవికుమారునిన్, గణపతిన్ నను ధన్యునిఁ జేసి నాకు వి
ఘ్నావళి నెల్లఁ బాపిబహుళాభ్యుదయంబులొసంగి ప్రేమతోఁ
గావఁగ, నాంధ్రసత్కవిని - కాయముమత్కృతికుల్లసింపగన్

కం॥ భూతలము నుదురు సోఁకఁగఁ
బ్రీతిన్ బ్రొక్కుచు, నుతియొన - రింతున్ గవితా
నేతన్, వడ్డాదికులున్,
సీతారామాంజనేయు - శ్రీగురుదేవున్.

సీ॥ రామచంద్రుని, హనుమంతుఁ - బ్రస్తుతింతు

వేణుగోపాల దేవుని - వేడ్కఁ గొలుతు,

సత్యదేవుని నా పేరి - స్వామిఁ దలఁతు

నాత్మ నలరుచు నీ మూర్తు - లన్ని గనుచు.

సీ॥ మూఁడుమూర్తుల మహిమతో - మూఁడులోక

ములను నేలుచు, నారోగ్య - ముఖ్యభాగ్య

వరము లిడు సూర్యదేవు ప్ర - భావ మెంచి

వందన మొనర్చుచుందు స - ద్భక్తియుక్తి.

ఆ॥ వె॥ హంసవాహనుఁ బ్రణ - వాకారు, భారతీ

ప్రియు, నజున్ నమస్క - రించుచుందు

నాదు గావ్యమునకు, - నాకు దీర్ఘాయువున్

ముదముతోడఁ దా న - నుగ్రహింప.

శ్రీరస్తు.

ఓం నమః కామేశ్వర్యై.

# ఉష.

## సంజ.

భారతీదేవి కరుణా ప్ర - భావమునను
విద్యఁ గల్గినవాఁడు, గో - విందుఁ డనఁగ
కలఁ డొకఁడు, కళావంతుల - కులము యువకుఁ
డుదయపుర మనునొక చిన్న - యూరియందు.

గీ॥ కలిమి లేముల పసఁ జూడఁ - గలిగినాఁడు;
సద్గురుకటాక్షమును బొందఁ - జాలినాఁడు
మానవావళి సేవయే - మాధవాంఘ్రి
సేవగా నెంచినాఁడు హృ - త్సీమ నతఁడు.

శా॥ శ్రీవిశ్వేశ్వర పాదపంకజసుధా - సేవానుభూతిన్ సదా
భావంబందునఁ బొందుచుండియు, మనో-భారంబు బాధింప నే
వేవోయూహలమున్గిమూఁగవలె నెం- తేనుం డెడున్ బాప! మా
గోవిందుండు నిజాన్వయంబుస్థితికిన్ -గోడొందు డెందంబునన్.

గీ॥ మౌనము వహించి కదలుట – మాని యూర
కాకసమువంకఁ జూచుచు – నాతఁ డుండె
నూర్జిత సమాధిలో నుండు – యోగివోలె
సంజ నొకనాఁడు సైకతస్థలమునందు.

గీ॥ వాని హృదయాన రేకెత్తు – భావములను
వెలికిఁ బుచ్చంగ సమయంబు – వెదకికొనుచు
నెదురు తెన్నులు సూచుచుఁ – బదిలముగను
గాచుకొనియున్న వాఁ "డుషన్" గలిసికొనఁగ.

గీ॥ అంతలో వచ్చుచుండెను – సంతసముగఁ
బొత్తములఁ జేతఁ గొంచును – ముద్దులొలుకు
పలుకులను జెప్పుకొనుచు నె – చ్చెలులతోడఁ
బాఠశాలనుండి "యుష" యె – ప్పటివిధాన.

గీ॥ వచ్చుచున్నట్టి బాలికన్ – బలుకరించి
నిల్పి, కుశలంబు లడుగుచు – నిక్కువంపుఁ
బ్రేమయును, జాలియును గల్గు – వీక్షణముల
నెంతయును జూచి, యామెతో – నిట్టు లనియె.

"కం॥ అమ్మా! శ్రద్ధగ నీ పా
ఠమ్ముల నిత్యముఁ జదువఁ గ - డంగెదవా? స
త్యమ్ముఁ బలుకుచుందువ? గురు
వమ్మల యభిమాన మొంది - యలరుదువుగదా?"

ఆ॥ వె॥ అతఁ డట్టు లడుగ - నా యువ భక్తియు
గౌరవంబు, ప్రియముఁ - గడలుకొనెడు
చిత్తవృత్తితోడఁ - జిఱునవ్వు మోమునఁ
జెంగలింప బదులు - చెప్పఁదొడఁగె.

సీ॥ "శక్తివంచన లేకుండఁ - జదువుచుంటిఁ
బంతులమ్మలు మెచ్చంగఁ- బాఠములను;
మొదటి మార్కులఁ బొందుచు - మురియుచుంటి
నన్న! యన్ని పరీక్షల - యందుఁగూడ."

గీ॥ ముగ్ధభాషల బడిలోని - ముచ్చట లిటు
లేవొ యొకకొన్ని సంతోష - మెసకమెసఁగఁ
జెప్పుచున్నట్టి బాలిక - యొప్పుఁ గాంచి
పలికె నీరీతి నతఁ డెద బాధఁ జెంది.

శా॥ అమ్మాయీ! యొకమాట నిన్నడిగెదన్ - హాస్యానకున్ గాదు ని
త్యమ్మున్ నాహృదయాంతరాళమున శ - ల్యంబౌచు బాధించు ము
ఖ్యవ్యాస్మై నొక్క విశేష మద్ది, మదిలోఁ - గంగారు లేకుండ శాం
తమ్మున్ జెందివచింపు మమ్మ! యనుమా సంబొందఁ గాఁ బోకుమా!

సీ॥ చదువుకొని నౌకరిని జేయ - సంతసంబొ?
తగిన వరుఁ బెండ్లియాడంగఁ దలఁచినావొ?
గాక వేశ్యవై వర్తింపఁ - గాంక్ష కలదొ?
నీ తలం పెటులున్నదో - నిజము చెప్పుమ!

కం॥ నీ యూహయు, మా పెద్దలు
చేయంగాఁ బూను తలఁపుఁ - జెప్పుము తల్లీ!
నాయందుఁ గోపగింపకు
మా! యి ట్లడిగితి నని యివి - మనలో మాటల్.

గీ॥ అనిన నునుసిగ్గుదొంతరల్ - కనులనుండి
జాలువాఱంగ, నించుక - జంకి. యెటులొ
కొంతవడికిని ధైర్యమ్ముఁ - గూర్చుకొనుచుఁ
బలికె నా ముగ్ధ యతని కి - ప్పగిది నపుడు.

ఆ॥ వె॥ సానివృత్తిలోనె - సౌఖ్యమ్ము గలదంచుఁ
దల్లి చెప్పుచుండు - నెల్లవేళ
అక్క తలఁపుఁగూడ - నట్టులే యున్నది
వారి కేను బదులు - పలుకలేదు.

ఆ॥ వె॥ పెద్దచదువులోఁ బ్ర - వేశించి యుద్యోగ
మందమొందఁ జేయ - నభిలషింతు;
దాని కిష్టపడరు - తల్లియు, నక్కయుఁ
గాన నట్లుసేయఁ - గాదు నాకు.

ఆ॥ వె॥ పెండ్లిమాట నాదు - పెద్దలకును గిట్ట
దందు సుఖములేద - టంచు వారు
తెలుపుచుందురు మన - కులము సంసారులు
పడుచునున్నయట్టి - బాధ లెల్ల.

ఆ॥ వె॥ కోరినట్టి తిండి, - కోరిన బట్టయుఁ,
గోర్కెదీఱు నగలుఁ - గూడఁ గలిగి
భోగభాగ్యములను - బొందుచు సుఖియింపఁ
బెంపుఁ గూర్చునంట - వేశ్యవృత్తి.

ఆ॥ వె॥ ఆమె పల్కులెల్ల - నాలించి గోవిందుఁ
డాత్మయందు దుఃఖ - మాఁపరింపఁ
గనులలోన నశ్రు - కణములు తొలఁకాడఁ
బలుకసాగె నపుడు - బాల కిట్లు.

“గీ॥ బాల! యెంత యమాయక - రాల వీవు!
నీదు మాటలకును నాదు - నెమ్మనమ్ము
కరగిపోవుచు బాధింపఁ - గాఁ దొడంగె
లాభనష్టమ్ము లెఱుఁగఁజా - లవుగదమ్మ!

గీ॥ అభము శుభము నెఱుంగని - యట్టివార
లెంద రెందఱు బాలిక - లీ కులాన
నరకకూపానఁ బడుచును - న్నారొ? తల్లి
పేరి స్వార్థపైశాచికా - వేశమునను!

గీ॥ మంచిచెడ్డల మది నిర్ణ - యించుకొనెడు
పాటి జ్ఞానమ్ము రానట్టి - వయసునందె
తల్లు లిటు బోధనల్ చేసి - పిల్లలకును
బాడుచేయుచునున్నారు - వారి బ్రతుకు.

గీ॥ హితము, శ్రేయమ్ముఁ గోరి నే - నిపుడు నీకుఁ
గొన్నిమాటలు చెప్పఁగా - నున్నవాఁడ
సావధానమ్ముగా విను; - మీవు నేనుఁ
గులముచే నొక్కటగుటచేఁ - దెలుపవలసె.

మ॥ మన దేశమ్మునఁ గల్గుసంఘములలో - మర్యాద యేమన్న చో
వనితల్ ప్రాణముకంటె మానమునకే - ప్రాముఖ్యమున్ గూర్చియు
క్కనిఁ బెండ్లాడి గృహస్థమార్గవిధులన్ - గావించి లోకంబు మ
న్ననలన్ బొందిచరిత్రఁగావలె మహా - నందాబ్ధినోలాడుచున్.

శా॥ ఈమార్గమ్ము శుభమ్ము, గౌరవము, నెం - తేఁ గూర్చు స్త్రీజాతికిన్
క్షేమంబిచ్చుపథమ్ము, దీనినిజగ - చ్ఛ్రేయార్థమాయాబుధుల్
ప్రాముఖ్యం బిడి తెల్పినార; లిదియే - వర్తిల్లు వేదోక్తమై;
యేమో చెప్పితి నంచు నెంచకుము నీ - హృత్సీమ నో సోదరీ!

గీ॥ ఇందుఁ గష్టమ్ము సైత మెం - తేని గలదు
కష్టముల కోర్చి ధర్మమ్ముఁ - గావవలయు,
నపుడె జన్మమ్ము సార్థక - మగు నుజుమ్ము
సానబట్టిన రత్నంబు - చంద మొంది.

ఆ॥ వె॥ క్షేమగౌరవముల – యా మాట లవి యేల?
సౌఖ్యమైనఁ గలదె – సానివృత్తి?
భ్రాంతివలన దుఃఖ – వారాశిలోఁ బడు
టగునుగాదె సాని – యగుట తల్లి!

ఆ॥ వె॥ తాము దుఃఖపడుచుఁ – దమ లాభమునకు, నే
పాప మెఱుఁగనట్టి – బాలికలను
గొంకులేక గొంతుఁ – గోయు రే వేశ్యలు
కల్లబొల్లిమాట – లెల్లఁ జెప్పి.

సీ॥ ఇతర దోషంబు లేమున్న – నింతులకును
జగము సైరించుఁగాని, యే – చాయనైన
శీలలోపమ్ము గలయట్టి – స్త్రీజనమును
జూచుఁ బ్రజ యెల్ల నీచాతి – నీచముగను.

సీ॥ అట్టి శీలమ్ము వెలకునై – యమ్ముకొనెడు
వృత్తిఁ గల్గిన దగుటచే – వేశ్య యనినఁ
జెప్పరాని యసహ్యతఁ – జెంది ప్రజలు
హీనముగఁ జూచి దూషింతు – రెల్ల వేళ.

గీ॥ ఎల్లసంఘమ్ము "ఛీ!" యంచు - నీసడింప
నెట్టి సందర్భములఁ దల - యెత్తలేక
గౌరవము లేని జీవమ్ముఁ - గడపుకంటెఁ
గష్ట మున్నదె తల్లి! లో - కంబునందు?

గీ॥ గౌరవము లేదు సరికదా - కడకు సుఖము
మాత్ర మున్నదె చూడ న - మ్మార్గమందు?
ఆ వ్యథల నిటఁ జెప్ప భా - వ్యంబుగాదు
తెలిసి మెల్గొన్నవారల - వలన వినుము.

సీ॥ ఎందుకుఁ బుట్టితి - మీ యమ్మ కడుపున
నంచుఁ బుత్త్రిలు నిత్య - మలమటింప
నలుగురి నడుమను దలయెత్తలేకుండ
సోదరుల్ దుఃఖించి - సోలుచుండ
గౌరవ జీవమ్మ - గడపు బంధువు లెల్ల
మది సిగ్గు నొందుచు - గ్రుస్గుచుండ
గరుణతో విద్యను - గఱపు నాచార్యుండు
మచ్చఁ బొందితి నంచు - నొచ్చుకొనఁగ

గీ॥ హీనముగఁ జూడఁబడుచుండి - యెల్ల వేళఁ
జేయునది లేక దుర్భర - జీవితంబుఁ
గడుపవలయును సోదరీ! - గణికవృత్తి
యెంత నీచమొ యోచింపు - స్వాంతమందు.

కం॥ నీకున్, నీవారలకున్,
లోకమునకు శోక మొప్పడ - నూనముగాఁగన్
సోఁకించు మార్గ మియ్యది
యేకరణిఁ జూడ క్షేమ - మిం దున్నదియో?

గీ॥ ఇపుడు బడిలోన స్నేహ మెం - తేనిఁ గల్గి
యరమరయె లేక నీతోడ - నాడునట్టి
బాలికల్ వివాహిత లయి - చాల వేడ్క
నలరుచుండుదు గృహాలక్ష్ము - లగుచుఁ దల్లి!

గీ॥ అపుడు వేశ్యగనుండి స్నే - హంబుఁ దలఁచి
వారితో నీవు మాటాడఁ - గోరు దేని
చీదరించెద రెంచక - నీదు చెలిమిఁ
గులసతికి వేశ్యతోఁ బొత్తు - కూడదనుచు.

గీ॥ పెండ్లియై నీవునుంగూడఁ బ్రియ మెసంగ
నీదు నెచ్చెలులను జూడఁ బోదు వేని
గౌరవింతురు తమవంటి - గరిత వంచుఁ
బేదదానవెయైనను - లేదు వెలితి.

గీ॥ ఇట్టి ఘోరావమాన సం - వృత నికృష్ట
మానహీన జీవన మెల్ల - దేనికొఱకుఁ?
బ్రతుకుకోసమెకద!; శరీ - రమ్ము పోష
ణమ్ము నొనరింప నింక మా - ర్గమ్ము లేదె?

గీ॥ కూలియో, నాలియో చేసి - కొంచుఁ జీకు
చింత లేవియు లేకుండ - నెంతమంది
పేదకాంతలు జీవింప-లేదు? తల్లి!
తమకు గల మన్ననలను ని - త్యమ్ముఁ బొంది.

గీ॥ జాతిలోఁ గప్పనున్ గూడ - గతుణమ్ముఁ
జేయ నాహార మిడినట్టి - చిన్నెయుండు
కావఁడే మానవావళిన్ - గరుణతోడ?
నిది మనమ్మున నమ్ము మీ - వింకమీఁద.

గీ॥ పంచభక్ష్యాన్నములఁ దృప్తిఁ - గాంచవచ్చుఁ
జీనిచీనాంబరముల రా - జిల్లవచ్చు
హేమభూషణముల ధరి - యింపవచ్చు
వేశ్య లని తలంచెదవేమొ - వెఱ్ఱితల్లి!

మ॥ ఒకరోయిద్దఱొ తప్పభాగ్యవతులీయూరన్ గలారొక్కొ యీ
సకలాంధ్రావనిలోన? నిట్టులెసుమా సానుల్ సుఖంబొందుటల్
యకటా! దిక్కును మొక్కులేని దశలో నల్లాడువా రెందఱో
యొకమాత్రైనను విన్న నట్టి భ్రమ నీకుండంగఁబో దమ్మరో!

గీ॥ అగ్నిసాక్షిగఁ బెండ్లాడి - నట్టి భర్త
కంటికిఱెప్పవలె నిన్నుఁ - గాచుకొనుచు
బూచిపడియుండు నీ క్షేమ - మునకుఁ దల్లి!
కాక వేశ్యవైయైనచోఁ - గలదె దిక్కు?

ఉ॥ 'ప్రాణము పోలెఁ జూచుకొని ప్రాపయియెల్లసుఖంబులిచ్చుచున్
రాణులయట్లు సానులను రంజిలఁజేయరె కొంద' అంచుఁ బూ
బోఁణి! తలంతు వేమొ! యది మోహాముచేత నెగానివారిహృ
త్కోణమునన్ బవిత్రమగు కూరిమిగల్గుటఁగాదునమ్ముమా!

ఉ॥ 'వారలుమాత్ర మెందులకుఁ—బావన రాగపరీత మానసుల్
గా రని?' ప్రశ్ననన్నడుగఁ—గాగమకించెద వేమొ! భార్యయున్
గౌరవనామ మిచ్చి, శుభ—కార్యములందున భాగ మిచ్చి, సం
సారమునందు హక్కు నిడఁ - జాలునొకో యొకఁడేని సానికిన్.

సీ॥ దైవకార్యములలోఁ – దనప్రక్కఁ గూర్చుండు
భాగ్య మొసంగునే – భర్తయట్లు
తగు బంధువులమధ్యఁ – దన రాణిగా గౌర
వముతోడఁ జూచునే – భర్తయట్లు
తనవెంటఁ దీర్థయా – త్రలు సేయఁ గొంపోయి
పాటించునే విధుల్ - భర్తయట్లు
నలుగురిలోఁ దన - నామమ్ముఁ జెప్పుకో
వలె నన్న నొప్పునే - భర్తయట్లు

గీ॥ ఏవిధమ్మునఁ జూచిన – నించుకైన
స్థానమీయక, యూరకే – తన సుఖంబు
కోసమే పోషణముసేయఁ– గోరు విటుఁడు
మగని బోలునె యెన్ని జ- న్మములకైన?

ఆ॥ వె॥ కర్మసాక్షి లేని - కాలాన గదిలోన
దప్పు గౌరవింప - నొప్ప నతఁడు
సర్వకాలములను - సర్వవిధంబుల
నరసి ప్రోచు మగని - యట్టిఁ డగునె?

ఉ॥ కావున నెట్లుచూచినను-గౌరవహానియు, సౌఖ్యహాని, దుః
ఖావహముఁ బొనర్చునర-కమ్మునుగూర్చుచెకానిసుంతయున్
జీవితసౌఖ్య మన్నది యి - సీ! కనరాదుగ వేశ్యవృత్తిలో!
నీ విషయమ్ము నెంచియిఁక-నెట్టులొనర్చెదొ నిశ్చయింపుమా!

శా॥ గోవిందుండిటు తేటతెల్లముగ వా-కొంచున్ బ్రబోధింపఁగా
భావంబందున సత్యమున్ దెలిసి 'అబ్బా!- యింతమోసంబు నే
మావారల్' పొనరింపనుండి; రిఁక స-న్మార్గంబు వర్తించితిన్
నీవల్లన్ దెలివొందితి యంచునుష వా-నిన్ మెచ్చుచున్ బల్కెనన్

గీ॥ కటికి-చీఁకటిఁ బాసి జ - గంబు తెలివి
నలర నొప్పుచు భానూద - యంబుఁ దెలుపు
నల ప్రభాతమ్మువలె జాతి - నలర జేయు
విమల విస్ఫూర్తిగల యుషః - ప్రమద వీవు.

గీ॥ జరుగఁగల దింక జ్ఞానభా - స్కరుని రాక
కులము తప్పక వెలుఁగొందఁ-గలదు; చాల
హర్ష మొందితి నీ నిశ్చ - యంబునకు: సు
దిన మిది; జయంబు నొంది వ - ర్ధిల్లుమమ్మ!

గీ॥ అనుచు నీరీతి సంతోష - మతిశయిల్ల
నాతఁ డాడిన మాటల - కాత్మ నలరి
యతని యనుమతిఁ గైకొని - యా కుమారి
యరిగె నింటికి దృఢనిశ్చ - యంబుతోడ.

వ॥ అంత గోవిందుండు తన మనంబున సంతసించి "దైవకృపవల్ల నిప్పటి కొక పని నెఱవేరినది. తక్కినదిగూడ జేయఁ బ్రయత్నించెద" నని భావించి తన సంఘీయుండును, దయాశీలుఁడాౌరు కుమారుండును, బి. ఏ. చదువుచున్న యువకుఁడును నైన సుధాకరునితో మాటలాడ నిశ్చయించి. యామఱునాఁ డాతని గృహంబునకుం జనియె. సుధాకరుఁడును గోవిందుని గౌరవించి యతనితో సంతోషముగా మాటలాడఁ దొడంగెను. అట్టియెడ గోవిందుండు సుధాకరునితో నిట్లు సంభాషింప మొదలిడియె.

ఉ॥ ఓయి సుధాకరా! తెలుప-నుంటిని నీ కొక సంగతిన్ సుల
శ్రేయముఁ గోరి, శాంతముగఁ- జేసి విమర్శన నీవు, నీ యభి
ప్రాయముఁ దెల్పుమయ్యమన-వంశపు మచ్చను బాపి శోభిలన్
జేయఁగలట్టివాఁడ వని - ని న్నెద నమ్రతఁ జేసి పల్కెదన్.

సీ॥ కనకసుందరి యనునామె - కలదు కాదె
యామె చిన్నికూతు "రుష" యను - నట్టి బాల
చదువుకొనుచున్న దెంతయు - శ్రద్ధఁ గలిగి
వయసు తలసూపసాగె వి - వాహమునకు.

సీ॥ దాని యందంబుఁ, జందంబు, - దాని తెలివి,
దాని సుగుణా, లమాయిక - మైన మనసు,
దాని మాటల పొందిక - దాని మంచి
నన్ను ముగ్ధునిగాఁ జేసె - నమ్ము మోయి!

సీ॥ ఎల్ల లలనల మదిలోనఁ - దల్లులవలెఁ
జూచు నా కిట నా బాల - సోయగంబు
వర్ణనమ్మును జేయ భా - వ్యంబుగాదు
హృదయ సౌందర్యమునకె నేఁ - దృప్తిఁ గంటి.

గీ॥ తల్లి పెడత్రోవఁ బెట్టంగఁ - దలఁచుచుండె
దానివల్ల నే యయ్యది - నే నెఱింగి,
తెలుపవలసిన విషయంబుఁ - దెలిపినాఁడఁ
దెలిసి యా బాల పెండ్లాడ - దీక్షఁ గొనియె.

ఉ॥ కావున నీవు నాహితవుఁ - గైకొని యామెను బెండ్లియాడి మేల్
సేవయొనర్చి సంఘమును - జీఁకటినుండి వెలుంగుఁ జేర్పవా!
యీ విషయంబు కష్టమని - యెంచక నీవు ప్రయత్నమూనుచో
దైవము తోడ్పడున్ జయము - తప్పక కల్గును నీకు సోదరా!

కం॥ నీ తలిదండ్రులు దీనికి
కాతరు సేయరు, తమకు న - గౌరవ మని నీ
వే తీరున సాధించుచు
[illegible]తినఁ బొందెదవో? సంఘ-గౌరవ మొసఁగన్.

చ॥ అన విని పిన్ననవ్వు నగి-యాతఁడిటుల్ పలుకంగసాగె కూ
డని పనిఁ బూని యిట్టు లక-టా! చరియించెద వేల? సంఘమో
యని విలపించెదేల? యిటు - లా మతిమాలిన వారి గోలతో
ననిశము నుండు విద్దెతగు - నా? మతిపోయెనె నీకు? సోదరా!

సీ॥ చదువుకొంటివి, పెద్దల - సాహచర్య
మొందియుంటివి, దైవమ్ము - నందు భక్తిం
గలిగియుంటివి, నీ విట్టి - కానిపనికిం
బూని చరియింప మర్యాద - పోవదొక్కొ!

ఆ॥ వె॥ కాన నింతవట్టు - మానసంబున నెంచి
విననివారి గోల - విడిచిపెట్టు;
వారికోస మీవు - ప్రాకులాడుచుకాని
తిరిగి నిన్ను వారు - తిట్టుచుంద్రు.

సీ॥ మనము నాయంత్రశ మనిపించు- కొనుచునుండి
గౌరవస్థాన మొందిన - వారముగద!
వారు నీచులు, మనకును - వారి కెట్లు
పొసఁగు సంబంధ - బాంధవ్యములు మహాత్మ!'

కం॥ ఆ పలుకుల్ తన మదికిన్
దాపముఁ బుట్టించుచుండఁ - దాలిమి విడఁగా
నోపక యా గోవిందుం
డోపికతో విను మశాంత-యుత మానసుఁడై.

గీ॥ కొంతసే పైన వెనుక ప్ర - శాంత వదనుఁ
డౌచు, నాతని కిటు బదు - లాడసాగె
"సోదరా! నీదు ప్రేమయు, - నాదరంబుఁ
గాంచఁ గల్గుట హృదయానఁ - గలిగె ముదము.

ఆ॥ వె॥ కులము పేరు నీవు - గూఢమ్ముగా నుంచు
కొన్న లేక చెప్పు - కొన్న నేమి?
గుణ**ము**వలన జనులు - గణియింపఁబడుచుందు
ర నెడు నిత్య సత్య - మరయుమయ్య!

ఆ॥ వె॥ నీదు విద్యవలన - నీదు నుద్యోగంబు
వలన నీకు గౌరవంబు - గలుగుఁ
గాని కులము దాఁచు - కారణంబునఁ గాదు
దీని గుట్టు నీవు - తెలియవలయు.

గీ॥ ఎంత యున్నత పదవిలో - నెసఁగుచున్నఁ
గులముచే నిన్నుఁ జూతురు - చులకనగ నె
కులము దాచక యున్ననుగూడ - నీకు
వ్యక్తిగతమైన గౌరవ - మమరియుండు.

గీ॥ ఎందుచే మన కులమున – కిట్టి బాధ
యున్నదో నీకుఁ దెలిసియే – యున్నదికద!
యా కళంకము బాసిన – యపుడు మనము
కులము సంతోషముగఁ జెప్పు–కొనఁగ లేమొ?

గీ॥ ఎంత కాలమ్ము స్వార్థమ్ము – నెంచుకొనుచుఁ
దగినవారలు చాటున – దాఁగియుందు
రంతకాల మజ్ఞానమం – దణఁగిపోయి
కులము పేరిట్టులే యుండఁ – గలదుసుమ్ము.

ఆ॥ వె॥ మూఢమతులవలన – మోసంబు గావింపఁ
బడినవారు వేశ్య – వనిత లకట
పాప మట్టివారి – పైనిఁ గోపం బేల?
తెలిపి చేరఁదీయ – వలయుగాసి?

ఆ॥ వె॥ కులములోన నొక్క – గుణవంతుఁ డుండినఁ
గులము కీర్తిఁ – గలిగి వెలయుననుచు
నార్యసూక్తిఁ దలఁచి – యర్మ్యులో మీరెల్లఁ
గులముఁ బ్రోవ దీక్షఁ – గొనఁగవలదె?

గీ॥ అర్హులగువారు సంఘ కా - ర్యంబు నిపుడు
కష్టముల కోర్చి నెఱవేర్పఁ - గడఁగు నెడల
మనదు సంతానమైన నీ - మచ్చఁ బాసి
వంశ గౌరవ మొనగూడి - వఱలఁ గాక?

ఉ॥ ఈ నిముసంబునందు మన - మెల్లర మొక్కటియై విడన్ వలెన్
సానులతోఁ గులమ్మనను - సఖ్యమటంచుఁ గలంతు వేమొ! యూ
పూనికతో మనోవ్యథలు - పోవునొకో? మన రక్తబంధువుల్
మానవిహీనమైన పెడ - మార్గమునన్ బడి కుందుచుండఁగన్.

ఉ॥ గౌరవమార్గ మెద్దియొ, య - గౌరవమార్గ మదేది యోకనన్
నేరని కారణంబున గ - ణింపరు సంఘము మాటగాని యు
న్వారికి బంధువర్గమనఁ బ్రాణము కాదె! యమాయికల్ సుమా!
వారినిఁ బ్రేమతోడ మన - వంకకు ద్రిప్పవలెన్ సుధాకరా!

గీ॥ సానులందున సంఘ సం - స్కారిణులిపు
డెంద రెందరు గలరో నీ - వెఱుఁగవలయుఁ
బేదలయ్యుఁ బుత్రికలకుఁ - బెండ్లి చేసి
కులము నన్నకుఁ దెచ్చు త్యా - గులును గలరు.

సీ॥ సంఘ మర్యాద నిలుపంగ - సాహసించి
తనయలకుఁ బెండ్లిఁ గావింపఁ - దగిన వరుల
కోస మల్లాడువార లీ - కులమునందు
నెంద ఉన్నారొ నేఁడు నీ - వెఱుఁగుమయ్య!

సీ॥ కాని నీబోంట్లు నిరసించు - కారణమున
నట్టివారలు తుదకు ని - రాశఁ జెంది
చేయునది లేక పిల్లలఁ - జెఱచుచుండు
టక్కటా! కల్గుచుండె నేఁ - డచట నచట.

సీ॥ మూఢమతు లగు తల్లుల - బోధ వినక
"ప్రాణమైన నిచ్చెద" మని - పట్టుఁబట్టి
పెండ్లియాడంగ భీష్మించు - పిల్ల లహహా!
కొంద ఉన్నారు మన కుల - మందు నేఁడు!

సీ॥ ఈ విధంబున దీక్షతో నెసఁగునట్టి
వారలకు మీరె కాదె యా - ధార మకట!
యట్టి మీరలు భవితవ్య - మరయకుండ
స్వార్థ మెంచిన సంఘ సం - స్కరణ మెట్లు?

సీ॥ తెలివిమాలిన వా రని – తిట్టఁబడెదు
కఠినమతులగు చానల – కంటె మీర
లే విధంబున సంఘాభి – వృద్ధిఁ జేయఁ
దోసపడుచున్న వారలో – దోఁచకుండె.

ఉ॥ ఎక్కున తక్కువల్ విడిచి–యెల్లరుగూడఁ గుల ప్రసక్తిచే
నొక్కటె యున్న సంగతి న–హో! గమనించుచుఁ బేదపిల్లలన్
మక్కువతోడఁ గైకొను టె–మంచిది మీకును సంఘవృద్ధికిన్
చక్కనిమార్గముల్ హృదయ–తాపముదీర్పనిదంభమార్గముల్

ఆ॥ వె॥ ఇంత చదువుకొంటి – నెంతయో కష్టంబు
నందకుండఁ బెండ్లి – యాడు టెట్లు
లని తలంతువేమొ – యది యెంత నీచమో
బోధ సేయలేదె – బుధులు మనకు?

ఆ॥ వె॥ చదువుకొంటి మనుచు – సంతసించుటె కాని
యిట్టి చదువువలన – నేమి ఫలము?
చేతిపనులు చేసి – జీవించువారలే
యింతకంటె – భాగ్యవంతులయ్యొ!

గీ॥ ఎంతొ ధనమును వెచ్చించి, - యెంతొ శక్తి
ధారవోయుచుఁ జదివిన - వారలకట!
తుదకు నౌకరి దొరకక - దుఃఖపడుచు
దిరుగుచుండుట లేదె! యీ - దేశమందు?

గీ॥ విసిగి వేసారి యెట్టులో - కొసకు నేదొ
నౌకరీలోనదూరు న - నంతరంబు
మాత్ర మున్నదె సౌఖ్య మా - మానవులకుఁ
బాపభూయిష్ఠ కర్మను - భవము తప్ప?

సీ॥ కన్నతల్లినిఁ బోలఁ - గాఁదగు తన యూరు
విడచి యే మూలకో - వెడలవలయు,
బంధుల నెడబాసి - పరుల సాయముఁ గోరి
పలుబాధ లందందుఁ - బడఁగవలయుఁ,
దన శరీరారోగ్య - మునకు భంగముఁ దెచ్చు
చోటుల వసియించి - స్రుక్కవలయు,
జీతమ్ము చాలక - చిక్కులఁ బడుచున్న
వేషమ్ము నెట్టులో - నేయవలయు,

గీ॥ మన కుల ప్రకాశకులైన - మణులు గలరు
వారి సంగతి కాదు నేఁ - బలుకు టెల్లఁ
దక్కు సామాన్య సేవలోఁ - జిక్కుకొన్న
వాఁడిని గురించి నా మాట - వాస్తవముగ.

చ॥ చదువుటకూడదంచుననఁ-జాలుదు నే! యటులంట మూర్ఖమా
గద! తగు విద్య లేక యెటు - గల్గును జ్ఞానము? కాని నౌకరీ
చదువులవల్లఁ గల్గదు ని - జంబగు జ్ఞానము; పొట్టకూటికిన్
గొదువఘటిల్లు; స్వేచ్ఛ-యునుగూడనశించునటంచుఁబల్కెదన్

ఉ॥ సోదర! సర్వశాస్త్ర పరి-శోధన చేసినమీఁద మున్ను ప్ర
హ్లాదుఁడు తెల్పలేదె పర-మార్థ మెఱుంగఁగఁజాలు విద్యయే
మాదిరిదో! గురుల్ పితయు-మాటికిఁ దన్నటుప్రశ్న సేయ; జ్ఞా
నోదయమున్ ఘటించుటక-హో! యటువంటిదె విద్య యౌఁజుమా

గీ॥ ఏమి చేయుటో తెలియక - యేడ్చుచున్న
సమయమునఁ బార్థునకుఁ సర్వ - సంశయములు
వోవఁ గృష్ణుండు చేసిన - బోధ యెదియొ
యదియె నరునకు సార్థక - మైన విద్య.

కం॥ తనకును దనవారలకును,
దన దేశంబునకు క్షేమదాయక మగుచోఁ
తన విద్యకుఁ ఫలం; బట్లు
లొనరింపనిచోఁ జదువు ప్రయోజనమేదీ?

ఉ॥ ఈనిషయంబు నెంచియెనుమీ! విబుధాగ్రగణ్యులైనవారు దే
శావనదీక్షతో నిపుడు - త్యాగముఁ జూపుచునుండిరయ్య! నా
నావిధమైన ధర్మపథ - మాత్మ నెఱింగి స్వసంఘ వృద్ధికై
సేవ యొనర్ప మేల్ ప్రతిన-చేసి, ముదమ్మున లెమ్ము సోదరా!

సీ॥ చెన్నరాష్ట్రపు రిజ - స్ట్రీశాఖ కధిపుఁడై
యలరిన బండి (శ్రీ) - హరి ఘనుండు,
శాంతుఁడు, మేధావి - సత్యదాతయునైన
సాటిలేని వకీలు - చక్రధరుఁడు
త్యాగమూర్తియు, మహో - ద్యోగ ప్రశస్తాధి
కృతుఁడైన భాస్కర్ల - కృష్ణమూర్తి
పండితశేఖరుం - డెండమూరి కులాబ్ధి
రాజు శ్రీ వేంకట - రమణ సుకవి

గీ॥ నిన్నిఁటికిఁగూడ సైచిన - నేమి ఫలము?
స్వేచ్ఛ సుంతయులేక, యో - పికకు మించు
పనుల భారంబు రేయిం బ - వళ్ళుఁ గలిగి
దుఃఖ మొందుటకాదె యు - ద్యోగ సుఖము?

గీ॥ ధనము, కాలంబు, శక్తియు - ధారవోసి
చదువుకొన్నట్టివారల - సౌఖ్యమిద్ది;
అందుకే నేఁటి చదువుల - యందు మోజు
వల దటంచు మహాత్ముండు - తెలిపియుండె.

గీ॥ ధనము నార్జించి తగు దాన - ధర్మములను
జలుపు నవకాశ మది లేదు - సరియె, యకట!
కూటికిన్, గుడ్డకైన నే - కొఱఁత లేక
జరుగుచున్న దె యీనాఁటి - చదువువలన?

సీ॥ వ్యవసాయ మొనరించు - వారలు హాయిగా
ధన్యజీవను లౌచుఁ - దనర లేదె?
చేతిపనులవల్లనె - జీవించువారలు
స్వేచ్ఛాసుఖంబుతోఁ - జెలఁగ లేదె?

వాణిజ్య మొనరించు - వారి జీవితములు
శ్రీవిలాసమున భా - సిల్ల లేదె?
లలిత కళోపాస - కుల జీవితానంద
మమరులకైన శ - క్యంబె పొగడ?

గీ॥ నిందలనుగూడ స్వేచ్ఛతో - నిట్లు బ్రతుక,
బ్రతుకునందలి సౌఖ్యంబుఁ - బాయఁజేయు
నట్టి నౌకరి చదువుల - కకృటకట!
భ్రాంతిచేత నెకట! మోహ - పటుట యెల్ల!

సీ॥ ముద్రాధికారంబు - పొందు నుద్యోగంబుఁ
జేసి రాజిల్లు ప్ర - సిద్ధ యశులు,
న్యాయవాది పరీక్ష - లందు నుత్తీర్ణులై
యసమాన ధీశక్తి - నలరువారు
పెద్ద డాక్టరు లన్న - పేరొందుచుఁ బ్రజోప
కారమౌ వృత్తిలోఁ - గ్రాలువారు
నల పాఠశాలల - యందు నుపాధ్యాయ
వృత్తిలో వర్ధిల్లు - విబుధవరులు

గీ॥ విమల భావుఁడు, సౌందర్య - విలసితుండు,
వర యశోరాశి యగు వీర - భద్ర సుకృతి
కులము దాచిరె? వీరల - వలనఁగాదె
మనకు నీపాటి స్థానమై - నను లభించె?

గీ॥ ఇట్టి మహనీయు లోకకాంద - ఱిపుడుఁ గలరు
మన కులాభివృద్ధికి దీక్షఁ - గొనినవార,
లింతయు నెఱింగి యజ్ఞాన - మింక విడిచి
లెమ్మ నీ విధిఁ దీర్ప శీ - ఘ్రమ్ము లెమ్మ!

మ॥అనిగోవిందుఁడుయుక్తియుక్తముగము-ఖ్యంబైనసంభాషణం
బొనరింపన్,వినఁగావినంగ మది నే-వోయూహ లంతంత కా
తనికిన్ గల్గుచువచ్చెభ్రాంతివిడి యా-త్మజ్ఞానమున్ బొందు భ
క్తునిరీతిన్ ముదమొందిలేచి,యాతఁడా-గోవిందుతోనిట్లనున్

మ॥ఓమహితాత్మ!భ్రాంతిపడి-యుక్తమమార్గమెఱుంగలేక నే
నేమియొమాటలాడితి క్ష- మింపుము; సత్యపథంబుఁ జూపి నా
తామస మెల్లఁ బాపితివి; - దాల్చెద నిప్పుడె కంకణంబు దీ
క్షామతి సంఘసేవకు, నిఁకన్ భవదాజ్ఞకు - నేను బద్ధుఁడన్.

గీ॥ అని సుధాకరుఁ డిట్టు ల - త్యంత దీక్షఁ
గొనిన, ముద మొంది గోవిందుఁ - డనియె నిట్లు
"నాకు, నీకును, సంఘుంబు - నకునుగూడ
నిది శుభోదయమోయి! కొ - మ్మిఁక జయమ్ము

గీ॥ రేపు సాయంతనము కొంత - సేపు మనము
కొన్ని విషయాలు మాటాడు - కొందమయ్య!
పోయివచ్చెద నేఁ డింకఁ - బ్రొద్దుపోయె
న నెడు గోవిందు మాటల - కాత్మ నలరి.

గీ॥ "అట్లె కానిమ్ము రేపు సా - యంతనమ్ము
నీ బసకు నేనె వచ్చెద - నిశ్చయముగ"
నని సుధాకరుఁ డాతని - వెనుక కొన్ని
యడుగు లరిగి "నమ స్తే" య - టంచు నిలిచె.

శ్రీరస్తు.

ఓం నమః కామేశ్వర్యై.

# ఉష.

## వెన్నెల.

వేడ్క నా సుధాకరుఁడు గో - విందునకును
మాట యిచ్చినమాడ్కి నా - మఱుదినమ్ము
నతని బస కేఁగ; నిర్వూరు - నచటనుండి
చనిరి వాహ్యాళి సైకత - స్థలమునకును.

ఉ॥ చల్లని పిల్లవాయువులు-సారెకుహాయిగ వీచుచుండఁగాఁ
బిల్లనఁగ్రోవు లూదుచును-బిల్లలు సొమ్ములఁదోలుచుండఁగాఁ
బిల్లలఁజూచుసందడిసిఁ - బిట్టలు గూండ్లకుఁ జేరుచుండఁగ
నల్లన నెల్లముచ్చటల - నాడుచునుండిరి వార లచ్చటన్.

ఆ॥ వె॥ అపుడు వచ్చుచుండె – నా దారినే "యుష"
యొంటరిగ దన సఖి – యింటినుండి
యాదరమున నామె – నట నిల్పి గోవిందుఁ
డపుడు కుశలవార్త – లడుగసాగె.

గీ॥ ఆ ప్తబంధువువలె నెంచి – యతనితోడ
నతి ముదంబున మాటాడు – నట్టి యుషను
జూచి యా సుధాకరుఁ డామె – సోయగంబుఁ
దెలివి తేటలుఁ బరికించి – తలఁచె నిట్లు.

గీ॥ వహ్వ! యేమి యీ బాల లా – వణ్యరాశి?
విశ్వమోహన సౌందర్య – విలసితంబు,
రాజకరజాల దీప్తి వి – రాజితంబు
నగుచు నిద్దాని వదనాబ్జ – మలరుచుండె.

గీ॥ సహజసౌందర్య భాగ్య రా – జసవిలాస
మలముకొని లేఁతనవ్వు తే – టలు వెలుంగఁ
గనులు మిఱుమిట్లు గొల్పు నీ – కన్యవదన
మెంత చూచిన మదికి సం – తృప్తి లేదు.

ఆ॥ వె॥ పెదవులందుఁ గలదొ = మృదువైన బుగ్గల
యందుఁ గలదొ! ముక్కు - నందుఁ గలదొ!
కనులలోనె కలదొ! - కనుఁగొనలేకుంటి
దీని సోయగంబు - లోని గుట్టు.

చ॥ ఇదియని చెప్ప వీల్పడని - యేదియొకానికళావిశేష మీ
ముదితముఖంబునం దెసఁగి-ముచ్చటఁగొల్పుచుఁజూడఁజూడ నా
హృదికెది యోసుఖానుభవ-మెంతయుగల్గుచునుండెనోర! నా
కిది గృహలక్ష్మియౌట దివి - జేంద్రపదంబు లభించుటేకదా!

ఉ॥ అందమదిట్టులుండ, హృద - యం బతినిర్మలభావశోభతో
డం దగి ధర్మమార్గమునె- డన్ జనుచుండుటఁ దెల్పుచుండె నీ
సుందరి పల్కుతీరు;కడుఁ-జోద్యముఁగొల్పుచునుండె దీనియీ
చందము నందమున్, వినయ-సంపదబుద్ధి వికాస మెంతయున్.

కం॥ మంచిచెడ్డల నరసించి - మగని మనసుఁ
దెలిసి వర్తించు నిల్లాలు - కలుగుకంటె
భాగ్య మున్నదె పురుషుని - బ్రతుకునందు?
నిదియె లేకున్న నెదియున్న - నేమి సుఖము?

సీ॥ కాన నీ బాలఁ బెండ్లాడఁ - గలుగు నెడల
జీవితానంద భాగ్యంబుఁ - జెంది, ధన్య
జీవనుఁడ నౌదుఁగాదె! నే - నేవిధాన
నైన దీనిఁ గైకొందు న - ర్థాంగిగాఁగ.

మ॥ అని యీ రీతిమనంబులోఁ దలఁచి యా - ప్యాయంబుగాఁ జూచు నా
తని వీక్షించినయంత భావమున నా - తన్వంగి కేదో వినూ
తన సౌఖ్యోన్నతి కల్గినట్టు లగుచున్ - దళ్కొందె; నా వెంట నే
తనువందున్ బులకల్ జనించి, పలుకన్ - ధైర్యం బెవన్ బాయఁగన్

సీ॥ సిగ్గుపడుచున్న యా బాల - చేష్ట లరసి,
యాదరంబున గోవిందుఁ - డామెతోడ
ననియె నిట్టుల "నమ్మరో! - మనమునందు
సిగ్గుపడుచుంటి వేల భా - షింప నిపుడు?

సీ॥ ఇతఁడు పైవాఁడు గాఁడును - మ్మితఁడు మన కు
లాంబునిధిచంద్రుఁ డమ్మ! సం - ఘాభివృద్ధి
కతుల దీక్షను గొన్నట్టి - యనఘుఁడమ్మ!
ధనికుఁ డైనట్టి తహశీలు - దారు కొడుకు.

గీ॥ ఇతఁడెపో సుధాకరుఁ డను - నతఁడు తల్లి!
నేఁడు బియ్యేను జదువుచు - న్నాఁడుసుమ్మి!
తనదు హోదాకు మీవారు - తగకయున్నఁ
గులము వెలయింప నిన్నుఁ గై - కొనఁ దలంచె.

గీ॥ మీర లిద్దరు సంఘంబు - మేలుకొఱకుఁ
గష్టముల కోర్చి ధర్మమా - ర్గంబునందు
జీవితంబుల నడిపి జే - జేలఁ గొనుచుఁ
జనుఁడు జాతికి మార్గద - ర్శకుల రగుచు.

గీ॥ అతఁ డటులాడు మాటల - యర్థ మరసి
యటకుము న్నె మనంబులో - నలముకొన్న
ప్రేమ మది నిండి తొలకాడఁ - గోమలాంగి
సిగ్గుపడి యంతఁ బరఁగించెఁ - జిన్నినవ్వు.

గీ॥ "ఇంక నేరీతిఁ బోరాడి - యిష్టయందు
గెలుపునొందెదరో చూడ - వలసియుండె
ధర్మసాధన మిదిగాన - దైవబలము
గలిగి మీరలు జయ మొందఁ-గలరు నిజము."

గీ॥ అనుచు దీవించి గోవిందుఁ - డనెడు మాట
లాత్మ నలరింప నాతని - యాజ్ఞఁ గొనుచు
నరిగె నింటికి నుష; సుధా - కరుఁడు నపుడె
సెలవుఁ గైకొని దీక్షతోఁ - జేరె గృహము.

గీ॥ ఆ సుధాకరుఁ జూచిన - యమ్మహార్త
మెట్టిదో కాని యా యుష - కిట్టిదనఁగ
రాని యనురాగ మాతని - పైని మాన
సమునఁ దొలుచూపులోననే - జనితమయ్యె.

గీ॥ అతని యందంబు, చందంబు - నతని ఠీవి
యతని విద్యయు, నున్నత - స్థితియు, నతని
సంఘ సంస్కరణాసక్తి - స్వాంతమందుఁ
దలఁచి మాటికి నామె మో - దాబ్ధి మునిఁగి.

గీ॥ ,,ఎటులఁగికొంటఁ జేసి- యింతకు మును పె, నే
హీనత యని వేశ్య - వృత్తిఁ జొఱక
పెండ్లి చేసికొనఁగ - భీష్మించియుంటిని
ధర్మమార్గ జీవి - తంబుఁ గడప.

ఆ॥ వె॥ నా వ్రతము ఫలించి - వచ్చిన వరుఁడును
దైవకరుణవలన - దక్కుచుండెఁ
గాన నాకు నెట్టి - కష్టాలు కల్గిన
జడియఁబోను; దీక్ష - విడువబోను."

గీ॥ అనుచు మదిలోన దీక్షించి - యా కుమారి
సతత మా సుధాకరునామ - జపముతోడఁ
గడపుచుండెను గాలమ్ముఁ; - గాని తనదు
దీక్ష యింట నేరికిఁగూడఁ - దెలియదయ్యె.

గీ॥ కతిపయ దినమ్ము లీరీతిఁ - గడచుమీఁద
బాల యొక శుభ వేళఁ బు - ష్పవతి యయ్యె;
నంతఁ దల్లియు, సోదరి - సంతసించి
చదువు మాన్పింపఁ దలచిరి - మొదటి పనిగ.

ఆ॥ వె॥ అట్టివేళ నామె - నాశీర్వదింపఁగా
గులము సానులెల్లఁ - గిలకిల మని
వచ్చి యుమను జూచి - భాషింపఁ దొడఁగిరి
తమకుఁ దోఁచినట్లు - తరుణు లెల్ల.

సీ॥ "ఎంతచక్కని దార! యిది - వేశ్య యైనచో
లక్షలాదిగ డబ్బు - లాగదొక్కొ!
తెలివి తేటలు గల్గి - తేజరిల్లెడు దీని
పాదాల కడ విటుల్ - వ్రాలరొక్కొ!
చదువు సంధ్యలు నేర్చి - జాణయౌ నియ్యది
సరసుల మెప్పింపఁ - జాలదొక్కొ!
ఆట పాటలఁగూడ - నంతంత నేర్పింప
సరిలేని సాని కాఁ - జాలదొక్కొ!"

గీ॥ యనుచు దమలోన గుసగుస - లాడునట్టి
వారి మాటలు సూదుల - పగిదిఁ దనదు
చెవుల నాటఁగ దుఃఖించి - "యవుర! యెట్టి
పాప మొనరించితినొ యిట్టి - పలుకు వినఁగ!"

కం॥ అని చింతాసాగరమున
మునిఁగి సుధాకరుఁ దలంచి - పొగులుచు, శ్రీదే
విని మది మ్రొక్కుచు "నే రీ
తిని నను రక్షింతువొ" యని - దీనత్వముతోన్.

కం॥ పలుకుచుఁ బరిపరివిధములఁ
బలవించుచునున్నయంత – వారు తొలంగన్
జెలువుగ ముత్తైదువ లట
నిలిచి శుభాశీస్సు లిడుచు – నిర్మలమతులై.

గీ॥ "శీఘ్రమే నీకు కళ్యాణ – సిద్ధిరస్తు
భద్రసౌభాగ్య సంచయ – ప్రాప్తిరస్తు
శ్రీవిలాస నిత్యానంద – సిద్ధిరస్తు"
అనుచు దీవించుచును జల్లి – రక్షతలను.

కం॥ ఆ పలుకులు తన కపు డమృ
తోపమమై హాయి నిడఁగ – నూరటఁ గని తా
నా పుణ్యాంగనలను మది
నాపద్బాంధవులుగాఁగ – నామె తలంచెన్.

సీ॥ ఉప పుష్పవతియైన – విషయంబు పురిలోన
నంతంత వ్యాపించె – నన్నియెడల
నెప్పటినుండియో – యీ బాలకై వేచి
యున్న విటావళి – యుత్సవమున

నామె తల్లికిఁ దమ - యభిలాషఁ దెలుపుచు
సిరిఁ జూపి భ్రమియింపఁ - జేయుచుండి
రందు కా తల్లియు, - నక్కయుఁ దగు భాగ్య
మొందంగ నువ్విళు - లూరుచుండి

గీ॥ యుషకు నేవేవో ముచ్చట - లూర కపుడు
చెప్ప మొదలిడి, బోధన - చేయసాగి
రెల్ల సంగతులను; వార - లల్లనల్ల
నామె నిఁక వేశ్యఁ జేసెద - మంచు దెలిపి.

గీ॥ “తరుణ మియ్యది మానమ్ము తగ” దటంచు
నంతవఱకును దన మది - నణచియున్న
దీక్ష నప్పుడు వారికిఁ - దెలిపె నిట్టు
లతుల ధైర్యమ్ము నూనుచు - నా కుమారి.

గీ॥ నే సుధాకరుఁ బెండ్లాడు - నిశ్చయమున
నుంటిఁ గావున మీ చేయ - నున్న పనికి
నెంతమాత్రమ్ము నొల్ల మీ - రిట్టి వింకఁ
బలుకఁ బోకుఁడు మీ కిదే - వందనంబు.

శా॥ ఆమాటల్ వినినంతవారలహహః! యాశ్చర్యముఁ జెంది "యే
మేమీ? నీ కొక నిశ్చయంబు-కలదా? యీవృత్తి నీచమ్మ? నీ
వేమో యొక్కనిఁ బెండ్లియాడెదవ? - నీ కీలాటి విజ్ఞానమా
నీ మాష్టర్లిడినా" రటంచు మిగులన్ -నిందింపగా సాగుచున్.

ఉ॥ సామపథమ్మునన్ మొదటఁజక్కఁగబోధన చేసి, దానమున్
ప్రేముడిఁజూపి, భేదమును-బెల్లుప యోగ మొనర్చి యెందునున్
కోమలినిశ్చయంబొకటఁ - గూల్పఁగఁజాలక క్రోధమూర్తులై
యామెపయిన్ జతుర్థవిధ-మంతఁ బ్రయోగ మొనర్పఁబూనుచున్.

కం॥ తల్లియు సోదరి యా యుష
నెల్లవిధమ్ములను బాధ - లెంతే నిడుచున్
గల్లల నేవియొ యితరుల
వల్లను జెప్పించి యెల్ల - పాటులు పడుచున్.

గీ॥ ఆమె నొప్పింప యత్నించి - యహరహంబు
బాధ లిడి యెన్ని చెప్పినఁ - బాప మామె
బాధ లన్నింటి సైరించి - పట్టు విడక
యుత్తమా సమాధానంబు - నొసఁగుచుండె.

గీ॥ ఏవిధమ్మునఁ జూచిన - నించుకైన
సార్థకము లేకపోవుటా - సాను లెఱిఁగి
తుదకు విసుగొంది యాబాల - నదయు లగుచు
గెంటివేసిరి "పో" మ్మంచు - నింటినుండి.

ఉ॥ వారలచేత గెంటఁబడి-బంధుగదుఃఖ నిమగ్నయౌచు "నా
కేసును దిక్కులే రకట!- యేగతి నే బ్రతుకంగ నేర్తు?" నం
చూరక కొంతసేపటులె- యుండి పరాత్పరు సంస్మరించుచున్
బోరున నేడ్చు నామె కొక-బోధ తళుక్కునఁదోచె బుద్ధిలోన్.

గీ॥ "సోదరునిబోలెఁ ద న్నెంతొ - యాదరమున
నెపుడుఁ జూచెడు గోవిందు - నింటి కరిగి
యతని శరణంబు వేఁడు" మం - చంతరాత్మ
పలికి యామెకు నూరటఁ - గలుగఁజేసె.

ఆ॥ వె॥ అపుడు చింతఁ బాసి - యామె గోవిందుని
యింటి కరిగి యతని - కెఱుకపఱిచె
విషయ మెల్ల; నతఁడు - విని యామె నోదార్చి
"జరిగె నిట్లు మంచి - కొఱకె" యనుచు.

ఉ॥ అంత సుధాకరుండు పర - మాద్భుతరీతిని షష్ఠక్లాసులోఁ
బంతముతోఁ బరీక్షలను - ప్యాసయి పట్టముఁ బొంది సంతసం
బెంతయు నొంది రాజిలఁగ - నెల్లరు వానిని మెచ్చుచుండి, రం
తంత ధనాఢ్యు లాతనికి - నాత్మతనూజల నిచ్చు కోర్కెతోన్.

గీ॥ కట్న మెంతయొ యిచ్చి మా - కన్య నిత్తు
మంచు సంబంధములు వచ్చు - టరసి యతని
తండ్రి యొకనాఁట నాతని - తలఁపు నెఱుఁగఁ
బెండ్లి విషయమ్ము నెత్తె సం - ప్రీతితోడ.

చ॥ అపుడుసుధాకరుండువిన - యమ్మునఁదండ్రికిఁ బల్కె "దైవస
త్కృపవలనన్ ధనంబునకు - నెట్టికొఱంతయు మీకు లేదు, క
ట్నపు భ్రమఁ జెంది మీరిపుడు - నన్ బలవంతము పెట్టవద్దు, సం
ఘపువిషయానఁ బాటుపడఁ - గామదిఁ బూనితి స్వేచ్ఛనిండిఁకన్.

గీ॥ నిక్క మిఁక దాపనేల నా - నిశ్చయంబు
వినుఁడు: సంఘ సంస్కరణకై - వేడ్కతోడఁ
గనకసుందరి యను నామె - తనయ నిపుడు
పరిణయం బొడనుంటి మీ పాద మాన.

కం॥ ఆ పలుకులు వినినంతనె
క్రోధోద్రిక్తాత్ముఁ డగుచు - ఘూర్ణిల్లుచు నీ
కీ పాడు తలం పెదలో
నే పాపాత్ముండు కొల్పె - నీగతి నకటా!

గీ॥ అనుచు నా నరసింహాఖ్యుం - డైన తండ్రి
యా సుధాకరు పల్కు, ల - నాదరించి
తూలనాడుచు "నీచులతోడఁ దమకుఁ
దగదు సంబంధ మెంతమా - త్రమ్ము" ననియె.

గీ॥ ధనము నధికారమును గల్గి - తనరుచుంట
నతని మాటకు నెదురాడు - నట్టివారి
సైచఁ డా తండ్రి తన యాజ్ఞ - సాగనలయు
ననెడు తత్త్వమ్ము గల వ్యక్తి - యగుటఁ జేసి.

ఉ॥ బూడిదయందు నత్తరువు- పోసినయట్లు, సుధాకరుండు వా
క్ప్రౌఢిమఁ జూపుచున్ సరస - పద్ధతిఁ దెల్పిన ధర్మమంతయుం
బాడయిపోయెఁ దండ్రి దెసఁ;-బట్టుదలన్ వహియించి తండ్రి పో
రాడఁగఁ జొచ్చె స్వేచ్ఛతగ-దంచుఁ గుమారుని కెంతమాత్రమున్.

గీ॥ తండ్రి కొడుకుల కీర్తిఁ - దగవు పెరిగి
యంతకంతకుఁ బంతంబు - లతిశయిల్లెఁ;
దండ్రి కొడుకును శిక్షింపఁ - దలఁచి యతని
నింటిలోనుండి పొమ్మంచు - గెంటివేసె.

ఆ॥ వె॥ "తండ్రిమాట వినని - దుండగీఁ" డను నింద
తనకుఁ గలుగునేమొ" - యని తలంచి
భయముఁ జెంది మదిని - బాగుగాఁ దర్కింపఁ
జొచ్చె సుతుఁడు ధర్మ - సూక్ష్మ మపుడు.

సీ॥ దైవపూజకు నడ్డు - తగిలిన పితను దం
డింపఁడే మున్ను చం - డీశ్వరుండు?
ధర్మమార్గంబును - దప్పిన యన్నను
విడనాడలేదె వి - భీషణుండు?
న్యాయంబుఁ దప్పిన - యాచార్యు నాజ్ఞను
సరకుచేసెనె మున్ను - శాంతనవుఁడు?
తన్ను నొప్పించిన - తండ్రిని ధ్రువుఁడు మున్
విడనాడి స్వేచ్ఛకై - వెడలలేదె?

గీ॥ కాన, ధర్మంబు విడనాడి - కాంక్షఁ బూని
జీవితాశయముల నడ్డు - చేయునెడలఁ
దండ్రినైనను విడచుటే - ధర్మ మనుచుఁ
దెలియనగుచుండెఁగద వీరి - వలన మనకు?

గీ॥ నేను సంఘసేవార్థమై - పూనుకొనిన
ధర్మ మార్గంబు తగ దంచుఁ - దండ్రి యిట్లు
పంతమున నన్నుఁ గఠినుఁడై - పాఱఁద్రోలెఁ
గాన నిందు నా వల్లను - గలదె తప్పు?

మ॥మదినీరీతిఁదలంచి"ధర్మమునకై - మాతండ్రితోఁబోరితిన్
సదయా!యీశ్వర!యింకనాకెటులునీ-సాయమ్ముఁజూపింతువో
గద! నీవేగతి నా"కటంచు స్మరణన్- గావించి ధైర్యం బెదన్
బొదలన్ జేయుచునాసుధాకరుఁడుస-మ్మోదమ్ము పెంపొందగన్

గీ॥ చల్లఁగాను గోవిందుని - యిల్లు చేరి
యతని యాతిథ్య మొంది తా - నంతమీఁద
మెల్లఁగా నెల్లవిషయమ్ముఁ - దెల్లముగను
దెలిపె నతనికిఁ గతవోలెఁ - బలుకసాగి.

ఉ॥ ఇట్టు లుషాసుధాకరులు - హృద్గత ధర్మపథాను వర్తులై
కట్టిన బట్టతప్ప మఱి - గవ్వయుఁ జేతను లేక దైవముఁ
గట్టిగ నమ్మి యాత్మ కుల - గౌరవ సాధన గోరి త్యాగులై
నట్టి గృహస్థు గేహమున - కట్టులు చేరిరి యిండ్లు వీడుచుఁ

గీ॥ అట్టు లుదయమ్మునను నె యుష - యంతమీఁద
నా సుధాకరుఁడును జేరి - రా గృహంబు
నొక్కదినమందె; గోవిందుఁ - డక్కజపడి
"దైవ సంకల్ప మిది" యంచుఁ - దలఁచె నపుడు.

మ॥ ఇఁక సౌభాగ్యపురంబుఁ జేరియటఁ శ్రీ-మృత్యుంజయున్ సంఘనా
యకుఁడౌ స్నేహితుఁడా సియీ విషయమా-ద్యంతంబువ్రాసిచ్చి పూ
నికఁ గల్పించి, యుషాసుధాకరులకుఁ - శీఘ్రంబె కళ్యాణముఁ
సకలా ప్తుల్ ముదమొందఁ జేసెదనటన్ - సంఘుంబుసాయంబునన్

శా॥ ఆలస్యంబిటఁ జేయరాదు శుభకా-ర్యంబిద్ది; వేగమ్ముషః
కాలంబందునె రేపు నే వెడలెదఁ - గా కంచు గోవిందుఁ డి
ట్లాలోచించి, యుషాసుధాకరుల కా - హ్లాదంబు సంధిల్ల నా
వేళన్ నారికి సంగతిన్ దెలిపి, కా-వించెన్ ప్రయాణంబటుల్

ఉ॥ ఆతఁ డటులన్ ప్రయాణమయి-యక్కడిసంఘమువారికంతయున్
బ్రీతినిఁ దెల్పి, సర్వమును-వేగస్థిరం బొనరించి, యంత మో
దాతిశయంబునన్ దనగృ- హంబును జేరి వివాహయత్న మ
త్యాతురతన్ ఘటించెఁ బర-మాత్మునిపై నిడిభారమంతయున్

గీ॥ (శ్రీ) యుషా సుధాకరులకున్ - జెప్పఁదగిన
విషయములఁ జెప్పి వారల - వేగముగను
దోడుకొనిపోయె నతఁడు సం - తోష మొప్పఁ
బరిణయం బొనరింప సౌ - భాగ్యపురికి.

శా॥ఆయూరన్ గలసంఘసభ్యులువివా-హంబున్ గడున్ బ్రీతితో
జేయంగా సాగి సమస్త వస్తు వితతిన్ - సిద్ధంబుగావించి యెం
తోయుత్సాహముతోడసంఘగృహమందున్ సర్వసన్నాహముల్
శ్రీయుక్తంబుగఁ జేయఁగాఁదొడఁగి ర-క్షీణప్రమోదంబునన్.

వ॥ ఇట్లు లుషా సుధాకరుల వివాహ మహోత్సవంబు నకు సమస్తంబును సౌభాగ్యపురీ సంఘమువారిచే నాయిత పఱుపఁబడి తత్సంఘాధ్యక్షుఁడైన (శ్రీ) మృత్యుంజయుని యధ్వర్యమున శుభకార్యంబు సంఘ భవనంబున జరుపఁబడు

చుండెను. గోవిందుండును, సంఘసభ్యులైన బంధువర్గంబును, బురోహితుఁడును, సంస్కారణాభిలాషులైన మిత్రులును నతి సంతోషంబునఁ జెలఁగుచుండ శుభముహూర్తం బాసన్నం బగుటయు, వధూవరులను శృంగారించి, యలంకరింపబడిన వివాహవేదిక మీఁదికి దగువారలు తోడ్కొని వచ్చిరి. అంత విహితమగు పరిపాటితో మంత్రయుక్తంబుగాఁ బురోహితులు వివాహకార్యంబు జరుపుచుండిరి. ఆ సమయంబున——

గీ॥ వేదమంత్రోచితంబుగ - విప్రవరులు
చెలఁగి యా వధూవరుల కా - శీస్సు లిడగ
బంధువులు కాన్క లిడుచు దీ - వన లొసంగ
సంతసంబుగఁ బెండిలి - సాగుచుండె.

గీ॥ అపుడు గోవిందుఁ డానంద - మతిశయిల్లఁ
బెండ్లి వేదికపైని శో - భిల్లుచున్న
యా యుషా సుధాకరుల హి - తార్థి యగుచుఁ
జిత్త మలరార నిట్టు లా - శీర్వదించె.

శా॥ శ్రీసీతాసతి పాణిపద్మము నిజ- శ్రీహస్తమున్ జాచి,యు
ల్లాసం బొప్ప గ్రహించి, రాజిలెడు క-ళ్యాణోచితోద్యద్విభూ
షాసంపన్నుఁడు, రామచంద్రుఁడు,జగ-జ్జాలాభిరాముండు,సు
శ్రీసౌఖ్యోన్నతు లీ వధూవరులకున్ బ్రీతిన్ బ్రసాదించుతన్.

సీ॥ భక్తవత్సలుఁడు (శ్రీ) - పార్వతీ హృదయాబ్జ
హేళియౌ త్రిపురాంత - కేశ్వరుండు,
లోకపాలన కేళి లోలుఁడు, శ్రితజన
పాలుఁడు వేణుగో - పాలమూర్తి,
కామితార్థంబులఁ గరుణతో నొసఁగి భా
సిల్లు లక్ష్మీనర - సింహమూర్తి,
యఖిల భయంబుల - నడఁగించి విజయంబు
నిత్యంబు నిడు నాంజ - నేయమూర్తి,

గీ॥ పరమకృపఁ బూని యుచటి దైవంబు లెల్ల
నీప్సితార్థంబు లొసఁగి మి - మ్మేలుచుండ
నాయురారోగ్య భాగ్యంబు - లతిశయిల్లఁ
జిరయశం బొందుఁ డో చిరం - జీవులార!

గీ॥ సంఘమును, దేశమును, దైవ - సమముగాఁగ
నెంచి, సేవించి, సుకృతి గ - డించుకొని, త
రించఁగల భాగ్యమును బ్రసా - దించుఁగాక
యీ వధూవరులకుఁ బర - మేశ్వరుండు!

గీ॥ ఇట్టు లెంతయు సంతోష - మెసక మెసఁగ
నా యుషా సుధాకర వివా - హంబు జరిగె
నపుడు నూతన దంపతు - లతుల భక్తి
నరిగి మ్రొక్కిరి గోవిందు - చరణములకు.

గీ॥ అంత గోవిందుఁ డా జంట - కనియె నిట్లు
"ఓ వధూవరులార! నే - నొక్క కాన్కఁ
గోరుచున్నాఁడ నొసఁగరే - కూర్మితోడ
నీ పవిత్రపు వేళ న - దెట్టి దనిన.

ఉ॥ కేవల కామసౌఖ్యముల - కేయనియుట్టివివాహధర్మమున్
భావములన్ దలంపకుఁడు - బంధురమానవ ధర్మకర్మజా
లావృతమార్గమున్ గొని,ప-రార్థముఁగాంచు ప్రయత్నమందునన్
బావనసఖ్యమున్ జరుపు- భవ్యశుభక్రియ పెండ్లియౌఁగదా!

గీ॥ అందుచే నింక సంఘ కా - ర్యంబుకొఱకు
నాలు ఋతువులు గడచెను - నంతవఱకు
బ్రహ్మచర్యంబుఁ గలిగి ప్ర - వర్తిలంగ
బాస యిడుఁ డిదె నాకుఁ గా - వలయు కాన్క.

కం॥ అని గోవిందుం డడిగిన
విని సిగ్గున మోము వాంచె - వెలఁదుక, వరుఁ డా
తనితోఁ బలికె నపుడు "స
జ్జనవర యటె తప్పకుండ - సలిపెద" మనుచున్.

చ॥ అదివిని సంతసించి యపు - డాతఁడువారలతోడనిట్లనున్
"ముదమొదవెన్ మదిన్ మిగులఁ-బొందితిఁదృప్తిని నేఁడు; త్యాగసం
పద నలరారు మీవలన - మచ్చను బాసి కులంబు వెల్గెడున్
గద! యిదియే శుభోదయము-గాదె! వధూవరులార! జాతికిన్.

గీ॥ ఇంటికిన్ నేను ముదముతో - నేఁగువాఁడ
మీరె వహియింపవలె నింక - భారమెల్లఁ
గాన నా మాట లోకకొన్ని - కలవు వినుఁడు
తరుణ మిదిగానఁ దెలుపఁగా - దలఁచినాఁడ.

వ॥ అని వధువు మోము విలోకించి యిట్లు చెప్పఁ దొడంగెను.

మ॥వరరత్నాభరణంబులున్ గనకపున్ -వస్త్రంబులుఁ మేడలున్
స్థిరముల్ కావుసుమా! సతీమణులకుఁ - శీలంబె యైశ్వర్యమై
స్థిరసౌఖ్యంబును, గౌరవంబు,శుభమున్ - జేకూర్చెడిన్ ;గాననో
తరుణీ!భర్తృపదార్చనోద్యమముచే-తన్ శ్రేయముల్ పొందుమా!

మ॥కులమర్యాదయు,వంశగౌరవముమా-కుఁ గల్గి సంఘంబులో
దలయెత్తన్ గల భాగ్యమబ్బుటకు నో- తల్లీ! నినున్ బోలు క
న్యల కళ్యాణమహోత్సవంబు లిటు ల- త్యంతంబు వర్ధిల్లఁగా
వలె, మీశీలమె జాతికంతటికి శో-భన్ గూర్చునెక్కాలమున్.

మ॥అతులైశ్వర్యసమేతుఁడౌచుఁబతినీ-కత్యంతసౌఖ్యోన్నతుల్
మితిమీఱన్ సమకూర్చునాఁడు;మఱిలే-మిన్ గుందుచున్ సౌఖ్యముల్
పతి చేకూర్పఁగ లేనినాఁడు నొకటే - భావంబుతో నుండి నీ
పతినిన్ గొల్వుము;కల్మిలేములుమృషల్ ;-పాటింపుమాధర్మమున్

సీ॥ విభునిఁ బ్రాణంబుగాఁ - బ్రేమించి జగతికిన్
మాతయై వెలసిన - సీతవోలె,
యముని వెంటాడుచు - నాత్మేశు బ్రతికించి
విఖ్యాతిఁ గన్న సా - విత్రివోలెఁ
గలిమి లేముల నొక్క - గతిగ విభున్ గొల్చి
రాజిల్లినట్టి - చంద్రమతివోలె
నగ్నిపరీక్షల కాఁగి భర్తను గొల్చి
యలరిన యల దమ - యంతివోలె

గీ॥ సంతతము నీవు భర్తను - స్వాంతమందు
దైవముగ నెంచి, సేవించి - తనరుచుండి
యాయురారోగ్యభాగ్యంబు - లతిశయిల్లఁ
జిర యశం బొంది వెలయుమో - చిన్నితల్లి!

వ॥ ఇట్లు బోధించి, సుధాకరుని దిక్కు మొగంబై
గోవిందుఁ డిట్లు నుడువం జొచ్చె.

కం॥ నీలో సగబాలుగ నీ
బాలన్ మది నెంచి యెల్ల - పట్టులయందున్
బాలించుమె ధర్మముసుమ
పేలవముగ జూడరాదు - పెండ్లికుమారా!

మ॥అనుమానంబొకయింత లేకధృతితోఁ-ద్యాగంబుఁజూపించికం
కణమున్బూనితి విట్టులాత్మకుల సం-స్కారార్థమై; యందుచే
ధనహీనుండయినాఁడ;విప్పుడెసుమా- ధైర్యంబునిల్పన్వలెన్
ధనహీనున్దృణమట్లుచూచెదరువి - ద్యాహీనదంభ ప్రజల్.

చ॥ధనముగడించిచేయవలె - ధర్మవిధానము లెన్నియేనిఁ గా
వుననొకనీతియుక్తపథ-మున్గొని ద్రవ్యముఁగూడఁబెట్టి యో
పినగతి సత్క్రియల్ సలిపి - విప్ర కవీశ్వర పండితావళిన్
దనుపుచు జీవితంబుఁ జరి - తార్థత నొందఁగఁజేయగావలెన్

చ॥ ఇపుడు కుటుంబివైతి వెఁక-నిప్పటినుండియు నీదుశక్తియున్
నిపుణతఁ జూపుచుండి భవ - నీరధి నీద మొదల్ సుమా! శిరం
బుపయి ననేక బాధ్యతలు- ప్రోగయి నిల్చుచునుండు దైవస
త్కృపఁగనిసుమ్మనీవుకృత-కృత్యుఁడవయ్యెదుజీవితంబునన్.

ఆ॥ వె॥ కాన దైవభక్తి - కలిగి చరించుట
మొదటి ధర్మ మనుచు - మది నెఱింగి
ఋషులు తెల్పినట్టి - విషయముల్ గుర్తించి
తెలివి గలిగి మెలఁగ - వలయుఁజుమ్మ!

మ॥ మనసంఘమ్మునుగూర్చినీవటనటన్-మాటాడుచున్నప్పుడో
యనఘా! యొక్కటిజ్ఞప్తినుంచుకొను; మే-యంశంబునందైనఁద
క్కిన సంఘంబుల నిందచేయకు; నినున్ - గీడాడినన్‌గూడ మే
లని భావించి ప్రశాంతచిత్తమున ని-త్యంబున్ జరింపన్ వలెన్.

చ॥ వలదుసుమా! యొకప్పుడును-బ్రాహ్మణజాతినిధిక్కరింపఁబూ
ర్వుల కెప్పుడైన నీగతి వి - రోధము లుండెడివే? విదేశ వా
సులెసుమ యిట్టి భేదములఁ - జొప్పడఁజేసిరి గాన వెఱ్ఱిపో
కలఁ జనఁబోక వారియెడ- గౌరవభావముతో మెలంగుమా!

ఉ॥ వారల ధీవిశేషమును, - వారల శాంతిపరత్వము, త్యాగమున్,
వారితపఃప్రభావమును, - వారల విద్యయు, ధర్మదీక్షయున్
గారణమౌసుమా! భరత - ఖండపుసంస్కృతివాసిగాంచ; న
వ్వారలఁజూచిపొంగవలె - భావములో మన మెల్ల సోదరా!

గీ॥ సంఘసేవార్థమై నీవు – చనెడుపట్ల
నెవ్వ రేమన్నఁగూడ – సహింపవలయుఁ
గోపభావమ్మ సుంతయుఁ – గూడదయ్య!
స్తుతియు, నిందయు సమమతిఁ – జూడవలయు.

గీ॥ చెప్పవలసిన విధి గానఁ – జెప్పినాఁడ
నేవియో కొన్ని తోఁచిన – విట్లు నీకు,
మంచివాఁడవు, సత్య ధ - ర్మములు విడక
మనుము, జన్మసాఫల్యంబుఁ – గనెదుగాక!"

గీ॥ తెలుపవలసిన వీరీతిఁ – దెలిపి యాతఁ
డా యుషా సుధాకరులపై - నలరు కూర్మిఁ
గడకు విడలేక విడలేక – విడిచిపెట్టి
చేరె నింటికిఁ గార్యసం – సిద్ధి నొంది.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

శ్రీరస్తు.

ఓం నమః కామేశ్వర్యై.

# ఉష.

## వేకువ.

శ్రీ గోవిందునిబోధ నొంది, కులమున్ - సేవింప దీక్షించి, సంఘాగారంబున నొక్క-మూల వసతిన్ - గావించి, గ్రాసంబెటోయాగారిశుకృపాప్తిబాలురకు, వి-ద్యన్ జెప్పుచున్-గాంచి, తాసాగన్-జేసె సుధాకరుండు సతితో - సంసారమున్ దత్పురిన్.

సీ॥ అధ్యక్షు నానతి - నతి దీక్ష నాయూరి<br>
సంఘ కార్యంబులఁ - జక్కఁ బెట్టి<br>
సంఘ ప్రచారంబు - సలుపఁగాఁ బనిఁబూని<br>
పరిసర గ్రామాల - కరుగుచుండు

సభ లేవి జరిగినఁ - జని యందుఁ దమ సంఘ
భావంబులను దేట - పఱుచుచుండు
సంఘ బాలికలకున్ - జదువుఁ జెప్పుచు నారి
హృదయాల సంస్కార - మొదవఁజేయు

గీ॥ నిట్టు లనిశంబు సంఘాభి - వృద్ధికొఱకుఁ
దత్పరత్వమ్ము గల్గి సు - ధాకరుండు
పాటుపడుచుండె, నుష తన - భావమునకు
ననుగుణంబుగ మెలఁగి యా- హ్లాద మిడఁగ.

ఉ॥ఎప్పుడిఁకెప్పుడోయనుచు-నెంతయు నువ్విళులూరి సంతసం
బుప్పతిలఁ వివాహమటు- లొప్పిన జన్వనులయ్యు, బాసకున్
దప్పక బ్రహ్మచర్య కఠి - న వ్రత మూని పవిత్ర భావులై
య పరమాత్మ పాదముల- నాత్మలనిల్పిచరింతురిర్వురుఁ.

మ॥తనకార్యంబుఁద్యజించి,సంఘవిషయా-ర్థం బాతఁడత్యంతదీ
క్షను గాలంబు వ్యయించుటన్ దనకు సం-సారంబు నిశ్చింతగా
నొనరింపన్ దగు వీలులేనిదశ య - త్యుగ్రంబుగాఁ బట్టినన్
మనమున్ సుంతచలింపనీకజరపుఁ-సంఘక్రియల్ శాంతుఁడై.

ఆ॥ వె॥ అతఁడు చదువుఁ జెప్పి - యార్జించునది యెల్లఁ
దిండికైనఁ జాల - కుండె నకట!
కట్ట బట్టలకునుఁ - గఱవయ్యె వారికి
నింక నగల మాట - యెన్నవలెనె?

ఉ॥ తొలుతటినుండియున్ ధనము-తోఁ దులదూఁగివరాన్న వస్త్రముల్
గలిగి సుఖస్వరూపమును- గాంచి మెలంగిన భోగియయ్యు, న
గ్గలమగు లేమిబాధ లిటు - గల్గిననైనఁ జలింప డక్కటా!
కులముకళంకముం గెడపఁ-గోరిగదా! యతఁడింతకోర్చెడిన్.

ఉ॥ ముద్దునుముచ్చటం జరిపి-మోదముతోఁ దమవారు పెంపఁగాఁ
కద్దని లేదటంచు నొక - కష్ట మెఱుంగక యింతదాఁక నా
ముద్దియ గోముగాఁ బెఱిగెఁ-బూవువలెన్, మఱినేఁడు కష్టపుం
బ్రొద్దులుపుచ్చుచున్నయది - పూనికతోఁ గులగౌరవార్థమై.

మ॥ కడుపారం దినఁదిండిలేకమదిలోఁ-గాంక్షన్ విడన్ బోకయా
తఁడుసంఘవ్యవహారమగ్నుఁడయిని-త్యంబున్ శ్రమంబొందఁగాఁ
దొడగెన్ధైర్యముఁబూని;యట్లుజరుగన్-గొన్నాళ్ళకున్ దేహమం
దుడుగన్ జొచ్చె బలంబు; పేదకిదెగా- యున్నట్టి కష్టంబెటన్!

శా॥అంతంతన్ గృశియించియాయువకు కాయంబప్డులోనయ్యేదు
ర్దాంతప్రక్రియఁ బొల్చునొక్క రుజకున్-దానన్ వ్యథాన్వితుండై
చింతన్ జెందియతండు, మంచముపయిన్-జేరెన్ గతత్రాణుఁడై,
వంతన్ గుందుచు వానిభార్యతగు సే-వన్ జల్పుచుండెన్ గటా!

ఉ॥మంచముపట్టియాతఁడొక-మాసము నాయెను, మందులెన్ని సే
వించినఁగాని మేలు కని- పించకపోయె, నెటుల్ భవంబు సా
గించుట తోఁచదాయె, విధి-కృత్యము దాటఁగ రానిదాయె, ని
ల్పించఁగ రాని దుఃఖమున-నింతి మునింగి మనంబు లోపలన్.

మ॥అకటా! యింకెది యేని పాటుఁబడి నే-నార్జించినన్ దప్ప యిం
కొక మార్గంబెదియున్ గనంబడదు మా-కున్ గాన శీఘ్రంబుగా
నొక సంపన్న గృహంబుఁ జేరి యెటులో-యోర్మిన్ బనుల్ చేసి భ
ర్తకుఁ గాలాడెడుదాఁక నిద్దుగృహభా-రంబెల్ల దేవీకృపన్.

చ॥అనియిటు నిశ్చయించుకొని-యాయువ తద్విషయంబు భర్తకున్
వినయముతోడఁ దెల్పిన ను-వించుఁ గనుంగవ నశ్రులొల్క, నా
మెను గని, దీనకంఠమున- మెల్లఁగ నాతఁడు పల్కెనిట్టు "లో
వనజదళాక్షి! యెట్టిగతి- వచ్చెను నీకు, ననున్ వరించుటన్!

చ॥ పొలఁతి! గులాబిపుష్పమును-బోలెడునీసుకుమారదేహమున్
బలుగతులైన కష్టములఁ- బాల్పడఁజేయ మనంబురాదు, పో
వలవని గట్టిగాఁ బలుకు - పాటి బలంబును లేదు, కర్మపున్
ఫలమటులుండెఁగా, తెలియ-వచ్చునె యెప్పటికెట్టులుండునో!

చ॥ అని విధిలేక దుఃఖమున-నాతఁడుపల్కుటఁజూచి వాని నె
మ్మనమునఁగల్గు బాధఁగని-మానినియిట్లను "నో మహాత్మ! యిం
ద్రునకును గూడ నొక్కపుడు- దుస్స్థితి తప్పకపోయె, నట్టిచో
మనమన నెంత? దుఃఖమును-మానుడు దైవము మేలుఁగూర్పఁడే!

కం॥ అని తన భర్తకు ధైర్యం
బొనగూడెడునట్టు లామె - యోదార్చి మనం
బున జంకు వీడి యపుడే
చనె సేవార్థంబు నొక్క - సదనంబునకున్.

చ॥ అదియొకభాగ్యవంతునిగృ-హం, బటనామెతగంగ సేవకున్
గుదిరిశ్రమంబు నోర్చి తన-కున్ విధులౌ పనులెల్లఁ జేయఁగా
మొదలిడి, భర్తృసేవయును,-పోషణమున్ గడుభక్తియుక్తినా
ముదితయొనర్చుచుండెఁదన-పూనికకున్ బతి సంతసింపఁగన్.

గీ॥ ఇంత సాహసమున్ జూపి - యిట్టి కష్ట
ములకు నోర్చుచు - దన్నిటు బ్రోచుచున్న
దారతో నొక్కనాఁడు సు - ధాకరుండు
పలుకఁదొడఁగెఁ గృతజ్ఞతఁ - దెలుప నిట్లు.

కం॥ "కోమలి! నాపై నింతటి
ప్రేమంబును జూపి యిట్టి - విషమస్థితిలో
నేమియు విసుగొందక న
న్నీమెయిఁ గాపాడు నీదు - ఋణ మెట్లుదీర్తున్?

కం॥ స్త్రీపురుష జాతులందున
నే పగిదిం జూచిన నిల - నింతులె మిగులన్
బ్రాపై పూరుషజాతికి
శ్రీ పరమేశ్వరి విధానఁ - జెలఁగుదురుగదా!

గీ॥ స్త్రీల హృదయ సౌందర్య వి - శేషములను
దెలిసి ప్రొక్కని పూరుషుల్ - గలరె ధరణి?
నెల్ల ప్రాణులకునుగూడఁ - దల్లియైన
ప్రకృతి మీ రూపమున నిటుల్ - పరఁగుగాదె!

సీ॥ పలు కష్టముల కోర్చు - పట్టున భూదేవి
వలె సహిష్ణుతఁ గల్గి - వరలుచుండి
యతిథుల క్షుధఁ బాపి - యాదరించెడుపట్లఁ
దల్లి విధంబునఁ - దనరుచుండి
యాశ్రితావనమందు - నమృత ప్రదాయిని
శ్రీ దేవి విధమునఁ - జెలఁగుచుండి
సాహాయ్య మొనరించి - సాఁకెడునెడ సోద
రీమణి విధమున - నోముచుండి

గీ॥ పురుషజాతినిఁ గాపాడఁ - బుట్టి యెల్ల
జగతి కాధార మైనట్టి - జాతికాదె
స్త్రీ లనంగను! గావునఁ - జిత్తమందు
సతము మిమ్మెంచి ముదముతో - నతులొనర్తు.

గీ॥ తల్లి వలె, దాసివిధమునఁ - దనయరీతి
సోదరీమణిభాతిని - మేదురాద
రాభిమానములఁ జూపి - యరసి ప్రోచు
స్త్రీల ఋణమును బూరుషుల్ - దీర్పఁగలరె?

గీ॥ స్త్రీలవల్లనె జగతికిఁ - జెలువు కలదు
స్త్రీలవల్లనె పుడమిలో - సిరియుఁ గలదు
స్త్రీలవల్లనె ధాత్రి సం - ప్రీతి నొందు
నరయ మీతోడిదే జీవ - మతివ! భువికి.

సీ॥ రామచంద్రుని కీర్తి - బ్రహ్మాండముల నిల్చె
సీతమ్మ శీల వి - శేష గరిమ
నల హరిశ్చంద్రు స - త్య వ్రతము ఫలించెఁ
జంద్రమతీదేవి - సాయముననె
నలుని ధర్మాచర - ణంబు విశేషించె
దమయంతి సుగుణ - నిధానముననె
ధర్మజు కీర్తి యా - తారచంద్రార్కముఁ
వెలసె ద్రౌపదిభక్తి - విభవముననె

గీ॥ సత్యవంతుఁడు బ్రతికి ప్ర - శస్తిఁ గాంచె
సాధ్వి సావిత్రి సత్య దీ - ప్తా విభూతి
స్త్రీల యౌన్నత్య మిట్లు ప్ర - సిద్ధమయ్యెఁ
బూజనీయముల్ మీ జన్మ - ములు జగాన!"

కం॥ అని తనుఁ గొనియాడెడు భ
క్తనుగనుఁగొని యూమెప లెక్కెఁ- "ప్రాణేశ్వర! నా
కును విధియగుదానిని నేఁ
బొనరింపఁగ దీని కింత - పొగడుట తగునే?"

సీ॥ అనుచు నేమియుఁ గాని య - ట్లా లతాంగి
ధనిక గృహమునకును వేళ - దాఁటకుండ
సేవ చేయుటకై చనఁ - జిత్తమందుఁ
బరిపరి విధాలఁ దలఁచుచుఁ - బాప మతఁడు.

కం॥ తన యారోగ్యము చెడికద
తన కీగతి పట్టెనంచుఁ - దలఁచి యపుడు నె
మ్మనమున మృత్యుంజయు పద
వనరుహయుగ్మంబు నిల్పి - ప్రార్థించె నిటుల్.

శా॥ఓసర్వేశ్వర! యోదయామృతనిధీ! - యోభక్తచింతామణీ!
యోసర్వాత్మక! సర్వదోషహరణా! - యో పార్వతీనాయకా!
యో సంసారతమోవిదారణ రవీ! - యోగీంద్ర హృత్పంకజా
వాసా! నిర్భరచిద్విలాస! నను(బ్రో-వన్ రావె! మృత్యుంజయా!

మ॥ గతజన్మంబునఁ జేయఁగాఁబడినదో- కాకింక నేకర్మమో
వెతలన్ బెట్టుచు రోగరూపముననన్- వేధింపఁగాఁ జొచ్చె, నే
గతిపథ్యంబులఁ జేసి, యౌషధములన్- గైకొన్నను న్ బోవలే,
దితరాశల్ మఱిమానినిన్నె గతిగా- నే నెంతు మృత్యుంజయా!

శా॥ ఏరీతిన్ భవదీయపాదయుగళీ-హృత్సీమ ధ్యానింతు? నే
నేరీతిన్ విధు లాచరింతు? నయయో!-యీ మానవత్వంబు నే
నేరీతిన్ సఫలం బొనర్పఁగలనో!- యీ నా మొఱాలించి నా
కారోగ్యంబును గూర్పవేని? భవరో-గార్తిఘ్న! మృత్యుంజయా

శా॥ ఆరోగ్యంబునకై తపించి, యిటులే- నల్లాడుటల్ నీపద
శ్రీ రాజీవయుగార్చనంబును బ్రజా- సేవాది ధర్మంబులున్
ధారాళంబుగఁ జల్పు భాగ్యమును నా-త్మన్ గోరియే కాని, నేఁ
గోరన్ గేవల మైహికోన్నతినిఁ జే-కూర్పంగ మృత్యుంజయా!

శా॥ ఈరోగంబునఁ జేసి కాదె యకటా!- యీరీతి నా మేను ని
స్సారంబయ్యె దృఢత్వమా తొలఁగె హృ-త్సారంబు తగ్గె మహే
శా! రాకాశివిధాన బాధ నిడు నీ- వ్యాధిన్ దొలంగించి నా
కారోగ్యంబు నొసంగి తేల్చుమిఁక సౌ-ఖ్యాంభోధి మృత్యుంజయా!

గీ॥ ఏది జీవిత సౌఖ్యమ్ము - సిడెదు సిరియొ
పుట్టి యారోగ్య భాగ్యంబు - నాత్మఁ గోరి
యాతఁ డీరీతి మొఱవెట్టు - నహరహంబు
భవుని పాదాబ్జముల నాత్మఁ - బాదుకొలిపి.

కం॥ అతఁ డిటు లుండ, నట పతి
వ్రతయగు "సుష" రూపమరసి-భావంబున మో
హితుఁడై యా గృహనాథుఁడు
మత మెఱుఁగఁగ లేక, వేల - మానిసియగుటన్.

గీ॥ ఒంటిగానున్న సమయాన - సుషను జూచి
యామెతో మెలమెల్ల మా - టాడఁ దొడఁగి
కోర్కె నెఱిఁగించి తన్నేలు - కొనుమటంచుఁ
బలికి సిరిఁ జూపి యాశలఁ - గొలుపసాగె॥

గీ॥ వాని పల్కులు వినఁగ న - మ్మానవతికి
జల్లు మనె గుండె; సంతాప - జలధి మునిఁగి
కొంతవడిఁ దెప్పిఱిల్లి యా - కుటిలమతికిఁ
జెప్పఁదగురీతి నటు బుద్ధిఁ - జెప్పె నామె.

చ॥ పనులుముగించియాపడఁతి-పాపము నెవ్వగతోడ నింటికిన్
జని తన భర్త మోముఁ గనఁ-జాలక చింతయు లజ్జ దోఁప నా
ననమునువంచియుంటఁగని-నాథుఁడువిస్మయ మొందియిట్లనెన్
"వనిత!యి దేమి? నేఁడిటులు-వచ్చితి వన్న దొలంగి ఖిన్నవై.

కం॥ అని మాత్రముతో నడిగెడు
పెనిమిటికిఁ జెప్ప లేక - వినిపించకయుం
డను లేక, తుద కతనికిన్
వినయమ్మునఁ దెల్పె నామె - విషయం బెల్లన్.

ఆ॥ వె॥ అట్లు తెల్పి ఖిన్న - యై యున్న యామెతో
బలికె నిట్లు గార - వమున నతఁడు
"చంచలాత్ములైన - సామంతు లీరీతి
నువిద! యచ్చటచట - నుంట వినమె?"

ఉ॥ ఇందునిభాస్య! నీగుణము-లెందునఁజూచిన నెంతయొప్పునే?
ముందటిబొందె నెట్టితప-మున్దగఁజేసితొ నేఁడు భార్యగాఁ
బొందితినిన్ను; నీమహిమ-మున్ గనలేక చలించె వాఁడు నీ
యం దొక దోషమున్ గలదె?-యాత్మ గలంగెద వేల దీనికిన్?

శా॥ నాయారోగ్యము నాఁడు నాఁడిటువలెన్ - బాగౌచునుండెన్ గదా
యాయార్య్రప్రియుసత్కృపన్ సుదతి! యింకందందు నేఁబోయి యే
దోయార్జించెద, నాల్గురోజు లెటులో - దుఃఖమ్ము సైరింపుమా
నాయందుం దయయుంచి; కర్మఫలమున్ - దప్పింపఁగా శక్యమా?

సీ॥ అనుచుఁ గన్నుల నీరొల్కు - నతనిఁ జూచి
యామెకూడను దుఃఖమ్ము - నాఁపలేక
బోరుమని యేడ్చె; నామె న - ప్పురుషుఁ డపుడు
తనదు నక్కునఁ జేర్చి యో - దార్పఁ దొడఁగె.

ఉ॥ ఆసమయంబునం దచటి - కా పురిసంఘపుఁ బెద్ద యాత్రలన్
జేసి పురంబు నా దినమె - చేరి, సుధాకరుఁ జూడ వచ్చి, చిం
తాసముపేత దుస్థితిఁ గ - నంబడువారల గాంచి యాత్మలో
గాసిలి, సంగతిన్ దెలిసి - గారవమొప్పఁగ బల్కె నీ క్రియన్.

శా॥ ఓసంఘోద్ధరణవ్రత ప్రచురభ - వ్యోత్సాహులారా! యిటుల్
గాసిం జెందుచునుంటిరే యకట! దీ - క్షన్ దీర్ఘయాత్రార్థినై
నే సంచారముఁ జేయుచున్ గనుఁగొనన్ - మిమ్మెంత కాలంబు; నే
లా సంతాపము మీకిఁకన్? మదిని ధై - ర్యంబూని యాలింపుఁడీ!

గీ॥ దేహదార్ఢ్యమ్ము సమకూడి - తిరుగుదాఁక
నో సుధాకర! యక్కలి - యున్న వస్తు
వులను మీ కిచ్చుచుందు ని - శ్చలతఁ గొనుఁడు
ప్రభుని కృప నీకు నారోగ్య - భాగ్య మొదవు.

గీ॥ అనుచు వాగ్దాన మొనరించి - యటులె యతఁడు
నాఁడు నాఁటికి వస్తుసం - తతి నొసంగఁ
గాలముఁ బుచ్చుచుండి రా - యాలు మగలు
"దైవసంకల్ప మిది" యంచుఁ - దలఁచుచుండి.

శా॥ గోవిందుండువివాహమున్ జరిపి,లో-కుల్ మెచ్చనుత్సాహమున్
భావంబందునఁ బొందియింటికిఁజనన్- దద్వార్తనాలించి, క్రో
ధావేశంబున నారసింహుఁ డతనిన్- దండింప నూహించి యే
వేవో కల్పన చేసి బాధ లిడఁగా - నెంతేఁ గడంగెన్ గటా?

గీ॥ కనకసుందరియును, నామె - తనయకూడ
నోటికిన్ వచ్చినట్లుగా - నొవ్వఁ బల్కి
సాగి రాతని; పాపమా - త్యాగమూర్తి
శాంతముఁ వీడ కెంతయున్ - సైఁచుచుండె.

ఆ॥ వె॥ సంఘసేవఁ జేయఁ – జాలుట కెంతయు
వీలు గలుగ నొక్క – వీధిబడినిఁ
బెట్టి జీవితంబు – వెళ్ళఁబుచ్చుచునుండెఁ
దృప్తిఁ గనుచు నతఁడు – దీక్ష విడక.

సీ॥ ప్రభుశక్తి తనయందుఁ – బరిఢవిల్లుటచేఁ, సు
ధాకరు తండ్రి ఈ
యెట్టులైన గోవిందు – హింసింపవలెనని
యధికార వర్గమ్ము – నాశ్రయించి
నేరముల్ కల్పించి – నిరతంబు యత్నించి
గోవిందు బడి నెట్లొ – కూలఁజేసె
నందుచే నాతని – కాధార మిఁక లేక
పలు బాములను బొంద – వలసె నకట!

గీ॥ మొదటనే పేద, యందుపై – నిదియుఁ గల్గఁ
బలువిధంబుల దారిద్ర్య – బాధ నొంది
ఋణములన్ మున్గి పరితప్త – హృదయుఁడగుచుఁ
బ్రార్థనముసేయఁ దొడఁగె నా "రాము" నతఁడు.

మ॥ ఋణబాధల్ తొలగించినన్నుఁ గృపతో - నేరీతి రక్షింతువో!
వ్రణముల్ వోలె నిరంతరమ్ముగ నవి నన్ - బాధింపఁగా సాగె వీ
క్షణముల్ ద్వ్యత్కరుణాన్వితంబులు వెసన్ - సారించినా బాధ తత్
క్షణమే తీర్చి ముదంబు నాకొసఁగుమీ - శ్రీ రామచంద్ర ప్రభూ!

శా॥ దారిద్ర్యంబను వ్యాఘ్ర ముదంత హతిచే - తక్ జాల గాసిల్లుచున్
దారిన్ దెన్నును గానకుంటి నిఁక నీ - దాక్షిణ్యముల్ జూపరా
వే! రక్షింపవె నన్ను లేమి పులినిన్ - వేటాడి; శీఘ్రంబుగాఁ
జేగన్ దీయవె నన్ను నీ సరసకున్ - శ్రీ రామచంద్ర ప్రభూ!

మ॥ నిను సేవించి ముదంబునొందిరట మా - నిశ్రేణియున్ సిద్ధసా
ధ్యనికాయంబును, దేవతా నికరమున్ - ధన్యాత్ములై మున్ను, నేఁ
డును భక్తావళిఁ బ్రోచుచుందువిటు నా - డున్ నేఁడి కేనాఁడు నా
ర్తినిఁ బోఁగొట్టి శ్రితాళి నేలెదవు తం - డ్రీ రామచంద్ర ప్రభూ!

మ॥ తరుణంబియ్యది యాలసించినఁ గడున్ - దైన్యంబు వాటిల్లు; ని
ష్ఠుర వాక్యాశుగ జాల పీడితుఁడనై - శుష్కించి యేమౌదునో?
కరుణాసారము నించి తత్క్షణమె నన్ - గాపాడి నీ భవ్య ని
ర్భర వాత్సల్యముఁ జాటు మీ జగతి న - ప్పా రామచంద్ర ప్రభూ!

శా॥'దారిద్ర్యంబునకంటె జచ్చుటె నితాం-తంబున్ సుఖం'బంచుమున్
ధీరుల్ సైత మధైర్య మొందిరికదా! - దీనుండ నే నెట్టు లీ
దారిద్ర్యాత్మకఘోరభూతహతులన్-దార్కొంచు సైరింతు? నీ
కారుణ్యంబును జూపినన్ మనుపు మిం-కన్ రామచంద్రప్రభూ!

మ॥'ప్రతిమా ఋన్ నను గూర్చి మేయిటుల మొ-జ్జన్ బెట్టు' ఏఁడంచు నీ
మతినూహించిచిరాకుఁజెందక ననున్- మన్నించి రక్షింపుమా!
పితయున్ మాత గురుండు దైవమును నీ-వేగావె? నీతోడ నే
సతమున్ నా వెత చెప్పుకోవలదె? యీ-శా! రామచంద్రప్రభూ!

శా॥ఆయుర్దాయముసత్క-ళావిలసనం-బారోగ్యమున్ రూపమున్
శ్రీయుక్తంబగుచోఁబ్రకాశిలుచు-ధాత్రిన్ సౌఖ్యముల్ గూర్చునా
యాయుర్దాయ ముమున్నుగాఁగలగు భా-గ్యంబెల్ల శ్రీ లేనిచో
శ్రేయం బీయవుగా గృహస్థున కహో!-శ్రీరామచంద్రప్రభూ!

మ॥హృదయంబందుననిండిభారమయిన-న్నెంతేని బాధించుచు
న్నది దుఃఖం బిపు డక్కటక్కట! యెటుల్-సైరింపఁగాలేక నీ
పదపద్మంబులె నాకు దిక్కగుట ని-భ్భంగిన్ నినున్ వేఁడి నా
హృదయా వేదన తెల్పి యేడ్చెదను దండ్రీ!- రామచంద్రప్రభూ!

మ॥ అభయంబిచ్చికృతార్థుఁ జేసిహృదయా-హ్లాదప్రదంబైన నీ
శుభదృష్టిన్బరఁగించి యెన్నటికి నా-శోకంబుఁ బోకార్తువో?
యభవా! దీనులకీవు బంధుఁడవుకా-వా?త్వత్కృపాదృష్టి వృ
ష్టిభయాగ్నిన్ దెగనార్చి కావుము-ననున్ శ్రీరామచంద్రప్రభూ!

గీ॥ ఆతఁ డీరీతి భక్తితో - నహరహంబు
రామచంద్రునిఁ గూర్చి మొ - ఱల నిడంగ
సాగె; నంతట కొన్నాళ్ళు - జరుగుమీఁదఁ
గలుగఁజొచ్చెను జిత్ర సం - ఘటన మొకటి.

సీ॥ నారసింహునిమీఁద - నేరంబు లొకకొన్ని
కచ్చేరి పనిలోనఁ - గలుగు కతన
నతని నచ్చటనుండి - యన్యపురంబున
కరుగఁ బంపిరి ప్రభు - త్వాధికారు
లతని స్థానంబున - నానందరావను
విమలభావుండు రా - వింపఁబడియె
నమ్మహామహునకు - నల్లనల్లన యెల్ల
విషయాలు తెలిపెడు - విబుధవరులు

గీ॥ సంఘ సేవకుఁడౌ మన - త్యాగి విషయ
మెఱుఁగఁ జేయంగ నతనిపై - హృదయమందు
నంతు లేనట్టి దయ గల్గి - యతనిఁ గానఁ
గంకణముఁ దాల్చె నా యధి - కారి యూర!

గీ॥ వెంట నే ప్రభుత్వమునకు - వినతి వ్రాసి
సంఘమే దేశమాట నా - సంఘ సేవ
కుని యవస్థఁ దీర్పంగ, భూ - మిని నొసంగ
వలె నటంచుఁ దా నందు సి - ఫార్సుఁ జేసె.

గీ॥ అందుపై నుత్తరవు లతఁ - డందుకొనినఁ
దత్క్షణమె యొక్క భూమిని - దానె యొసఁగె
రామ పాదారవింద చిం - తామృతాబ్ధి
యందు నోలాడుచున్న గో - విందునకును.

గీ॥ ఇంతకును హేతు "నా రాము- కృపయె" యంచు
మదినిఁ దలపోసి, రాముని - మహిమఁ బొగడి
"అహహా! నే నింక ధన్యుండ - నైతిఁగాదె!
ప్రభుని కృప యిట్లు నాపైనిఁ - బరఁగు కతన!"

కం॥ అని యాతం డుప్పొంగుచు
దినదినమున్ రాము సేవఁ - దృప్తినిఁ గనుచున్
దనకుఁ లభియించిన, భూ
మిని బాగొనరించి, దాన- మేలు వడయుచున్.

కం॥ ఆనందరావు దయతోఁ
బూని ప్రయత్నంబుఁ జేసి - పోయిన బడియున్
వానికిఁ జేకూర్పఁగ నతఁ
డానందాంభోధి, నోల - లాడఁ దొడంగెన్.

చ॥అచటసుధాకరుండుతను-వందునదార్ఢ్యమునాఁడునాఁటి, కా
యచలసుతా మనోహరుద-యఁ గని మెల్లఁగ వీధి సంచరిం
చుచు,విధులెల్లఁదీర్పఁగను-చుఁ,ధృతినొందుచు, వేదశాస్త్రస
ద్వచనచయానుసారముగ-వర్తనమొప్పఁ గశాప్రపూర్ణుఁడై.

గీ॥ సంఘ సేవయె జీవిత - సార మనుచు
నతఁడు భావించి, యూరూరి - కరుగుచుండి
సత్యమార్గమ్ము నెల్లెడఁ - జాటుచుండి
బోధ సిటు సేయుచుండె స - మ్మోద మొప్ప.

సీ॥ బాలికలెల్ల వి - వాహంబు లాడంగ
మానసంబున దీక్షఁ - బూనవలయు,
బాలురెల్లరు జ్ఞాన - భాసిత మతులౌచు
సంఘ సేవ సతమ్ము - సలుపవలయుఁ
బురుషులెల్లరు మొక్క - వోని ధైర్యముఁ బూని
ప్రతికూల యత్నముల్ - పాపవలయు
మానవులైతి రె - ద్దానికో యద్దాని
నింతులెల్లరు గ్రహిం - యింపవలయు

గీ॥ నిట్టులాబాలవృద్ధంబు - గట్టి పంత
మూని మన జాతి కున్నట్టి - దీనదశను
బాపి యున్నత స్థితినిఁ గూ - ర్పంగవలయు
భవ్యమతులార! యో కళా - వంతులార!

సీ॥ ఏనాఁడు మన జాతి - నే యింటఁ జూచిన
గృహలక్ష్ములై కాంత - లెసఁగఁగలరో!
ఏనాఁడు మన జాతి - నెందును మగవారు
నీచవృత్తులు వీడి - నెగడగలరో!

ఏనాఁడు మన జాతి – కీ దుఃఖమునుఁగూర్చు
నజ్ఞాన భూతంబు – లంత మగునొ?
ఏనాఁడు మన జాతి – నే మూలఁ జూచిన
విద్యాప్రపూర్ణులే – వెలయఁగలరొ!

గీ॥ అహహా! యానాఁడుగద! హృద – యంబు లలరఁ
జింతలను బాసి కడు ధన్య – జీవు లగుచు
మనఁగలారము – సంతోషమునఁ జెలంగి
భవ్యమతులార! యో కళా – వంతులార!

సీ॥ పేద బాలుర కెల్ల - విద్యాప్రదానంబు
శ్రీమంతు లెల్లరుఁ - జేయవలయుఁ
గలవారి యింటి బి – డ్డలు, పేద పడుచుల
నర్థాశ మాని పెం – డ్లాడవలయుఁ
గృషియు వాణిజ్యమ్ము – నితర సంఘములతో
వెనుకాడకుండఁ గా - వింపవలయు
సంఘ మంతటికిని – సత్యప్రబోధమే
వృద్ధి మూల మటంచు – నెఱుఁగవలయు

గీ॥ దాస్య జీవమ్ము మాని స్వా - తంత్ర్యభావ
భరిత సంభావ్య జీవిత - భాగ్య మొంది
ప్రాజ్య భారత రాజ్య సం - రక్షణమ్ము
జరుప భీష్మింపవలయు సం - స్కర్తలార!

వ. అంతఁ గొన్నాళ్ళకు—

గీ॥ వాని విద్యయుఁ ద్యాగంబు - వాని దీక్ష
వాని ధీవిశేషముఁ బ్రభు - త్వమ్ముఁ జూచి
యొక్క యున్నతోద్యోగంబు - నొసఁగె నహహా!
కర్మము ఫలించె దైవయో - గమున నిట్లు.

గీ॥ సంఘ సేవ నొనర్పంగఁ - జాలినంత
వీలొసంగుచు, సౌఖ్య సు - శ్రీల నొసఁగు
పదవి లభియించి ధన్యజీ - వన మెలర్ప
నాతఁ డానందవార్ధి నో - లాడఁ దొడఁగె.

గీ॥ పెండ్లియై యాఱు ఋతువులు - వెడలె మున్నె
మాట దాటక యా జంట - మనసుఁ గట్టి
బ్రహ్మచర్యంబు సలిపి యీ - ప్రబలమైన
కష్టజాలమ్ముఁ గడచి సౌ - ఖ్యంబుఁ గనిరి.

గీ॥ ఆ యుషా సుధాకరుల జ - య ప్రశస్తిఁ
గనుచుఁ గులమెల్ల సంతోష - మునఁ జెలంగ
వారి తలిదండ్రు లటమున్న - బాధలందు
నుంటచే వారిఁ జేరినా - రుత్సవమున.

గీ॥ కొసకు దీనాత్ములై తమ్ముఁ - గూడికొనిన
తమదు పెద్దల నపుడు ని - తాంత భక్తి
గౌరవించినా రా సుధా - కరుఁడు, నుషయు
"నెట్టి ధర్మాత్ము!" లంచుఁ ద- మ్మెల్లఁ బొగడ.

గీ॥ రాహువక్త్రి విముక్తుఁడౌ - రాజు పగిదిఁ
గష్టపటలంబు దాఁటి యి - క్కరణి శుభము
లొంది వెలుఁగొంది యతఁ డపు - డుల్లమందు
దైవమును భక్తియుక్తుఁడై - తలఁచుచుండి.

మ॥ తనయీశోభనసౌఖ్యజాలమునకున్ - దైవంబుతోడ్పాటె కా
రణమంచున్ మది నెంచి బంధులను మి-త్రవ్రాతమున్ భూమి దే
వనికాయమ్ము నతండు రాఁబిలిచి స-ద్భక్తిన్ సతీయుక్తుఁడై
యొనరించెన్ "ప్రభుసత్యదేవువ్రిత"మ-త్యుత్సాహమేపారఁగన్

ఆ॥ వె॥ బంధు మిత్ర విప్ర - వర్గమ్ము లరుదేర
గృహము నవ్యశోభ - నెసఁగుచుండె
భావ మలర నపుడు - గోవిందుఁడునుగూడ
నా మహోత్సవమున - కరుగుదెంచె.

వ॥ ఇట్లు సకల బంధు మిత్ర భూసుర జను లానందమునఁ గూడుకొనియుండ నుషా సుధాకరులు నిశ్చల భక్తియుక్తులై సత్యనారాయణ వ్రతమ్ము తగు పురోహితులు చేయింప సలుపుచు శోభిల్లుచుండిరి. అట్టి సమయంబున సదస్యు లా దంపతుల వీక్షించి తమలో నిట్లాడుకొన దొడంగిరి.

సీ॥ ధర్మ రక్షణకునై - తమవారలనుగూడ
విడిచిపెట్టినవారె - వీర లహహా!
పలువిధ కష్టముల్ - పడియు సంఘము సేవ
విడక యుండినవారె - వీర లహహా!
వంశోన్నతినిఁ గోరి - వ్రత మూని సర్వత్రి
విజయ మొందినవారె - వీర లహహా!
తమ్ము హింసించిన - తమవారి భక్తితోఁ
జేరఁదీసినవారె - వీర లహహా!

గీ॥ ఇట్టి ధైర్యమ్ముఁ ద్యాగమ్ము - నింద్రియజయ
మిట్టి కారుణ్యభావంబు - నెందు గలవె?
కులము నెల్లను వెలిగింపఁ - గలిగినట్టి
విమల మాణిక్యములుగారె - వీర లహహా!

వ. అనెడు వాక్యంబు లెసఁగుచుండ వ్రతకార్యంబు జయప్రదమ్ముగ నెఱవేరగా, భూసుర మిత్ర బాంధవులు సంభావన, సత్కార, సంతర్పణంబులఁ దృప్తులై సంతోషమున నిజనివాసమ్ముల కరిగిరి, అంత నాటి రాత్రి—

గీ॥ పుడమియెల్ల మహాహ్లాద - మునఁ జెలంగఁ
గనులవిందుగ వెన్నెలల్ - గాయుచుండ
హాయిగా మేడపైని మా - టాడుకొనుచు
నా యుషా సుధాకరు లున్న - యవసరమున.

మ॥ "వెలసెన్ నీవలనన్ గులమ్మతివ! నీ- ప్రేమైకసేవాప్త స
త్ఫలముల్ జెందితి" నంచునాతఁడనియూ-వామాక్షిఁ గౌగింట రా
గిలఁగా జేర్చి తమిన్ గపోలతటిపైఁ- గేలూని లాలింప, నా
లలనారత్నము తృప్తయైయొడలఁబు-ల్కల్ దోఁపసిగ్గున్ గొనెన్.

ఉ॥ వేకువ యంతలోనె ప్రభవించెను! వార లెఱుంగకుండి రా
రాకను హాయి హాయి యదిరా! భవమన్నను వారిదే కదా!
లోకము సర్వముల్ నిదురలోన మునింగిన కాలమందు వి
న్నాకను గల్పపూలపడనన్ [illegible]దు వారి యుల్లముల్.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| పీఠిక | 1 | దేపు | దేవు |
| ఆశీస్సు | | | |
| 3 వ పేజీ | 8 | గొని | గొంటి |
| 6 | 3 | తొలుకాడ | తొలఁకాడ |
| 7 | 8 | చరిప | చరింప |
| 11 | 12 | తమకుగల | తమమగల |
| 16 | 6 | కూఁతు | చినకూఁతు |
| 19 | 5 | సుంచు | నుంచు |
| 21 | 11 | యమాయకల్ | యమాయికల్ |
| 21 | 13 | సంస్కారిణి | సంస్కారిణు |
| 22 | 2 | తనయునకు | తనయులకు |
| 24 | 3 | దుఃఖడుచు | దుఃఖపడుచు |
| 25 | 15 | పనులవలన | పనులవల్ల |
| 31 | 2 | దినమ్ము | దినమున |
| 43 | 4 | తనూజుల | తనూజల |
| 47 | 2 | గవ్యయు | గవ్వయు |
| 51 | 5 | నంతోష | సంతోష |
| 55 | 9 | చేయవభ | చేయవలె |
| 55 | 10 | గూట | గూడ |
| 56 | 13 | పరతత్త్వముఁ | పరత్వాతత్త్వమున్ |
| 72 | 2 | యక్కట | యక్కటి |
| 73 | 6 | బల్ పంతమూని | పంతంబుఁబూని |